# I

రామానుజాచార్యుల వారు తమిళదేశంలో జన్మించారు. అందు చేతనే అప్పటికే మహామహిమోపేతమై జగత్ప్రసిద్ధినందిన ఆళ్వారు సంప్రదాయానికి ఆధ్యాత్మిక వారసులు కాగలిగారు. ఆళ్వారు అనే పదానికి గంభీరమైన లోతులలోనికి చొచ్చుకొని పోయే వాడని అర్థం. ఆళ్వారులందరూ భగవత్తత్త్వమనే మహా సముద్రంలో లోతులకు చొచ్చుకుపోయి భగవంతునితో నిత్య సన్నిహితత్వాన్ని పరమ తీవ్రంగా కాంక్షించిన వారు. ఆళ్వారుల జీవితాలనూ, వారి తత్త్వ విచారణా విధానాన్నీ అవగాహన చేసి కోకుండా రామానుజులవారి జీవితాన్ని పరిశీలించడం అసమగ్రమే అవుతుంది. నిజానికి రామానుజాచార్యులవారు భక్తికింత ప్రాముఖ్య మిచ్చే వినూత్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికి ఎలా ప్రబోధితు లయ్యారో దీని వల్లనే తెలుస్తుంది.

క్రీస్తు వెనుక మొదటి ఏడు శతాబ్దులలోనూ జైన బౌద్ధాల వంటి అవైదిక మతాలు తమిళదేశంలోకి ప్రవేశించాయి. అవి ప్రధానంగా వైదిక ధర్మంలోని యజ్ఞయాగాది కర్మకలాపాన్నీ, వర్ణవ్యవస్థనూ తీవ్రంగా వ్యతిరేకించాయి. ఈ నూతన మతాల కొత్త మోజుకు లొంగిపోయి రాజులు వాటిని ఆదరించడమూ, దాంతో అవి బాగా వ్యాపించి త్వరలోనే వైదిక ధర్మం అదృశ్య మవుతుందనిపించడమూ జరిగింది. అట్టి పరిస్థితులలో ఆళ్వారులు రంగం మీదికి అవతరించారు. మతం సామాన్య జనాన్ని చేరా లంటే ప్రజామోదానికి పాత్రమైన ప్రాంతీయ భాషలో ప్రచారం జరగాలని ఆళ్వారులు గ్రహించారు. అంతవరకూ మత విషయా లకు వాహికగా ఉంటున్న సంస్కృత భాషను విడిచిపెట్టి భక్తినీ వేదాంతాన్నీ మేళవించి తమిళ భాషలో వారు విరివిగా పాటలు

వ్రాసి ప్రచారం చేశారు. వారి కృషివల్ల వైదిక ధర్మం పునరుజ్జీవనాన్ని పొందింది. రాజులు తిరిగి వైదిక ధర్మావలంబకులయ్యారు. అవైదిక మతాలకు ప్రజలమీది పట్టు తొలగిపోయింది.

ఆళ్వారులు మొత్తం పంద్రెండుగురున్నారు. వారు వివిధ కులాలలో జన్మించిన వారైనా అపార విజ్ఞానం వల్లా అమాయిక ముగ్ధభక్తి వల్లా అత్యంతాదర గౌరవాలకు పాత్రులయ్యారు. ఆ పంద్రెండుగురిలోనూ ఒక స్త్రీ ఉన్నది, ఒక అస్పృశ్యుడున్నాడు, కొందరు బ్రాహ్మణేతరులున్నారు. ఉన్న బ్రాహ్మణాళ్వారులలో ఒకరి జన్మ విషయంలో కొంత సందేహానికి అవకాశం ఉన్నది. అయినా వారందరూ పరమ విశుద్ధ జీవితాలు గడపినవారు. సర్వ శిరోధార్యాలయిన మహోపదేశాలు గావించినవారు. అందు చేతనే వారి మత ప్రబోధం కుల సంప్రదాయ పరిధుల నన్నింటినీ అతిక్రమించి బహుళ ప్రచారాన్ని పొందింది. యధార్థానికి దక్షిణ దేశంలో భక్తి మార్గాన్ని ప్రారంభించింది ఆళ్వారులే.

భగవంతుణ్ణి హృదయం ద్వారా అందుకునే ప్రయత్నం చెయ్యడమే ఆళ్వారుల ఉద్యమంలో ప్రాముఖ్యం వహిస్తోంది. అందుచేతనే ఆళ్వారుల ననుసరించే వారందరూ భగవదభీష్టానికి ఆనందంతో లొంగిపోవడమే అతన్ని చేరుకునే మార్గమని నమ్ముతారు. వేదాలకు గూడా అందరాని ఆ భగవంతుడు అతడే కావాలని కాంక్షించే వారికి అత్యంత సులభుడు. భగవదనుగ్రహం ముక్కు మూసుకుని తపస్సులు చేసే ఏ కొద్ది మందికో మాత్రమే కాక అవ్యాజ భక్తితో శరణు చొచ్చిన వారందరికీ లభ్యమవుతుందని వారు బోధించారు. ఈ ప్రబోధం వల్ల మానవ జాతిలో పతితులూ, భ్రష్టులూ అయి మిక్కిలి శోచనీయ స్థితిలో ఉన్న అధమాధములకు గూడా మనమూ భగవంతుణ్ణి చేరుకునే మార్గమున్నదన్న ఓదార్పు, నైరాశ్య విముక్తి లభించాయి.

జనశ్రుతిని బట్టి ఈ ఆళ్వారులు అయిదువేల సంవత్సరాలకు వెనుకటి వారని చాలామంది నమ్ముతారు. కాని తమిళ విద్వాంసులలో ప్రముఖులైన ప్రొఫెసరు ఎస్. వయ్యాపురి పిళ్లెగారు ఆళ్వారులందరూ క్రీస్తుశకము ఏడవ శతాబ్దికీ తొమ్మిదవ శతాబ్దికీ నడిమికాలానికి చెందినవారని నిర్ణయించారు.

ఆళ్వారులలో మొదటి ముగ్గురు పొయిహై, పూదత్తార్, పేయాళు. వారు పుష్పజన్ములని ప్రతీతి. పొందమ్మి (స్వర్ణ కమలము), కురుక్కత్తి (మాధవీ కుసుమము), చెంగల్వ (రక్తోత్పలము)- ఇవి వారి జన్మస్థానములట. పొయిహై కాంచీపురంలోనూ, పూదత్తార్ మహాబలిపురంలోనూ, పేయీ మదరాసులోని మైలాపురంలోనూ జన్మించారు.

వారు భగవదారాధన చేస్తూ ఒక ఆలయంనుండి మరొక ఆలయానికి వెళుతూ ఉండేవారు. వారిని గూర్చి హృదయాకర్షకమైన కథ ఒకటి ప్రచారంలో ఉన్నది. ఒకానొకప్పుడు హోరున వర్షం కురుస్తోంది. పొయిహై తిరుక్కోయిలూరులో ఒక యింట్లో చిన్న గదిలో తలదాచుకొన్నారు. ఆ గది చాలా ఇరుకుగా ఉన్నది. అలసట ఎక్కువగా ఉన్నందువల్ల ఆయన కాళ్లు జాపుకొని పడుకొన్నారు. కొంతసేపటికి పూదత్తార్ ఆ గది దగ్గరకు వచ్చి అక్కడ ఎవరో పడుకొని ఉన్నట్లు గమనించారు. ఆయన మర్యాదగా 'ఒకరికి పడుకునేందుకు చోటుంటే ఇద్దరు కూర్చోవచ్చు' నన్నారు. వెంటనే పొయిహై లేచి కూర్చుని పూదత్తార్‌కు చోటిచ్చారు. అంతలో మూడవ ఆళ్వారు పేయీ అక్కడకువచ్చి 'ఇద్దరికి కూర్చునేందుకు అవకాశమున్న చోట ముగ్గురు నిల్చోవచ్చు' నన్నారు. వెంటనే పొయిహై పూదత్తారులులేచి నిలబడి పేయీ నిలబడేటందుకు చోటిచ్చారు. ఆ చీకట్లో ఒకరి నొకరు ఎరగకుండానే ముగ్గురూ నిలబడి ఉన్నారు. ఆ సమయంలో ఎవరో అదృశ్యవ్యక్తి తమతో పాటు అక్కడ ఉన్నట్లు ఆ ముగ్గురికీ

తోచింది. ఆ వ్యక్తి భగవంతుడే అని హఠాత్తుగా స్ఫురించి ముగ్గురూ తన్మయత్వంతో గానం చేశారు.

తీక్ష్ణ కిరణమనే వత్తిని వెలిగించి ఆ వెలుగులో పొయిహై దేవ దర్శనం చేశారు. ప్రజ్వలమైన భక్తి జ్యోతి నెగసనద్రోసి పూదత్తార్ భగవద్దర్శనం చేశారు. పేయా ఆళ్వారు నిమీలిత నేత్రులై అంతశ్చక్షువులతో నిత్యానపాయిని అయిన రమతో కూడిన నారాయణుని దివ్య దర్శనం చేసుకున్నారు.

ఈ ముగ్గురి తరువాత వచ్చిన తిరుమాలిశై ఆళ్వారు భార్గవి మహర్షికి దేవకన్యయైన కనకాంగికి జన్మించిన వారని ప్రతీతి. వారి పుట్టుక మహారణ్య మధ్యంలో జరిగినట్లూ బిడ్డలు లేని గొల్ల వాడొకడు ఆ పసిబిడ్డను చూచి ప్రేమతో పెంచినట్లూ చెబుతారు. ఆయన ఏ ఆహారమూ లేకుండానే పెరిగారనీ, పెరుగుతున్న కొద్దీ ఆయనకనేక ఆధ్యాత్మిక శక్తులు సంక్రమించినవనీ చెబుతారు. వారిని గూర్చి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. వాటిలో ఈ కథ ప్రత్యేకంగా తెలిసికోదగినది.

ఒకప్పుడా ఆళ్వారు ఒకానొక వృద్ధ స్త్రీని యౌవనవతిగా సౌందర్యవతిగా మార్చివేశారు. ఆ దేశాన్ని ఏలుతున్న రాజు ఆమెను ప్రేమించి పెండ్లి చేసుకున్నాడు. ఎన్నేండ్లు గడచినా ఆమె అందం చెక్కు చెదరక పోవడమూ, ఆమె యౌవనం సడలక పోవడమూ గమనించి దీని రహస్య మేమిటని ఆమెనే ప్రశ్నించాడు రాజు. "ఇదియంతా తిరుమాలిశై ఆళ్వారుల అనుగ్రహ ప్రభావమని" ఆమె బదులు చెప్పింది. రాజు వెంటనే "మీ గురువును నా దగ్గరకు తీసుకు రమ్మని ఆళ్వారు శిష్యుడయిన కనికణ్ణన్‌కు కబురు చేశాడు. శిష్యుడు రాజు దగ్గరకు వెళ్ళి గురువుగారికి కబురంపించడం బదులు రాజే ఆయన దగ్గరకు వెళ్లడం మంచిదని మనవి చేశాడు. రాజునకు కోపంవచ్చి తనని పొగడుతూ ఒక పాట పాడుమని కనికణ్ణన్ను ఆజ్ఞాపించాడు.

తన నోటి వెంట గురుదేవ స్తోత్రాలు తప్ప అన్యస్తోత్రాలు రావని అతడు తిరస్కరించాడు. దాంతో రాజు ఆగ్రహం పొంది అతనికి దేశబహిష్కరణ శిక్ష విధించాడు. రాజ్యం విడిచి వెళుతున్న శిష్యుని మీది అభిమానంతో ఆళ్వారూ అతన్ని అనుసరించి వెళ్లారు. వెళ్తూ వెళ్తూ చాప చుట్టుకుని మాతో వచ్చివేయమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ వెళ్లారు. భక్తాభీష్టానికి లొంగి భగవంతుడూ వారిని అనుసరించారు. వెనువెంటనే ప్రజలంతా ఆయన్ని అనుసరించి వెళ్లిపోయారు. రాజ్యం యావత్తూ నిర్మానుష్యమై పోయింది. అప్పటికి రాజుకు వివేకోదయమై భక్తి మహాత్మ్యం అవగత మయింది.

తరువాతి కులశేఖరాళ్వారులవారు తిరువాన్కూరు పరిపాలకు లలో ఒకరు. ఆయన పరమ గంభీరమైన భక్త్యావేశము కలవారు. ఒకప్పుడాయన ఎవరో పౌరాణికులు రామాయణం చెప్పుతూ శ్రీరామచంద్రుడు దుఃఖ నైరాశ్యాలతో క్రుంగిపోవడం వర్ణించగా విని తన దైవానికి ఈ దురవస్థ ఏమిటని హృదయము ఉద్రిక్తం కాగా భగవత్సహాయానికి తన సైన్యాలు తరలి వెళ్లాలని ఆజ్ఞాపిం చారట. ఆయన భగవద్భక్తి భాగవతుల పట్ల వారు చూపిన ప్రేమాదరాల్లో సువ్యక్తమవుతూ వచ్చింది. ఒకసారి ఆయన మంత్రులు కొందరు దేవాలయానికి చెందిన భూషణాలు కొన్ని శ్రీ వైష్ణవులు దొంగిలించినట్లుగా దోషారోపణ చేశారు. కులశేఖరులు ఈ నిందను నమ్మక శ్రీ వైష్ణవుల పాలి నిర్దోషిత్వాన్ని నిరూపించ డానికి విషసర్పాల కుండలో తామే చేయి పెట్టారు.

శ్రీరంగ క్షేత్రంలోని శ్రీరామస్వామిని సేవించడానికి కుల శేఖరులు ప్రకటించిన తహ తహ, వారికి భాగవతోత్తముల యెడ గల భక్తి తాత్పర్యాలూ, జీవితంలోని ఒడిదుడుకులతో నిమిత్తం లేకుండా సర్వకాల సర్వావస్థలలోనూ భగవంతునకు వారు ప్రపన్నులై యుండిన విధమూ; ఇవన్నీ రూపంలోనూ విషయం

లోనూ విశిష్టమై పారవశ్యం పొందింప జేసే ఉత్తమ కవిత్వంతో నిండిన వారి "పెరుమాళ్ తిరుమొళి" అనే కావ్యంలో సువ్యక్తమవుతున్నాయి. కులశేఖరులు తమ్ము తాము శ్రీరామచంద్రుని తండ్రియైన దశరథునితో సమంగా భావించుకొని రాము నెడబాటును సహించలేనితనాన్ని ఎంతో తాదాత్మ్యంతో పర్ణిస్తారు. భక్తుడు భగవంతుణ్ణి తన పుత్రునిగా భావించే ఈ మార్గంలో వారిరువురకూ అత్యంత సన్నిహితత్వం ఏర్పడుతోంది.

అయిదవ వారైన తొండరడిప్పొడి ఆళ్వారులు అల్పకాల శృంగార విహారానంతరం భగవదనుగ్రహానికి పాత్రులయ్యారు. వారు తిరుమండాంగుడి గ్రామంలో జన్మించి పెద్దవారయాక పితృ పైతామహ క్రమంగా వచ్చిన ఉద్యాన పోషక వృత్తినే స్వీకరించారు. వారు బ్రహ్మచారులై స్త్రీ ముఖదర్శనం చేయమని ప్రతిజ్ఞ పట్టారు.

ఆ సందర్భంలో ఎట్టి వారికైనా చిత్త విభ్రమం పొందింప జేసే దివ్య సౌందర్యం కల దేవదేవి అనే వేశ్య ఆయన పెంచుతున్న పుష్పవాటిలో ప్రవేశించి వారి ప్రతిజ్ఞ సంగతి విని ఆరు నెలలలో ఆయనను మోహింప చేస్తానని తానూ ప్రతిజ్ఞ పట్టింది.

మరునటి రోజున ఆమె ఆళ్వారుల కభిముఖంగా వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేసి తనని శిష్యురాలుగా స్వీకరించ వలసినదని ప్రార్థించింది. శ్రీమన్నారాయణ భక్తులైన ఆళ్వారులు నిష్కపటంగా ఆమెకాశ్రయ మిచ్చి పుష్పవాటి పోషణ కనుమతించారు.

నెలలు గడిచిపోయాయి. ఒక రోజున కుండపోతగా వర్షం కురుస్తోంది. తడిసి ముద్దయిన దేవదేవిని చూచి తన కుటీరంలో తల దాచుకోమన్నారు ఆళ్వారులు. ఆమె చీర తడిసిపోయినందువల్ల కట్టుకునేందుకు తమ ఉత్తరీయ మిచ్చారు. ఆ సమయంలో వారి చూపులు పరమ సమ్మోహ జనకమైన ఆమె సౌందర్యానికి

ఆకృష్టమయి పోయాయి. అంతే. ఇక ఆళ్వారులు తమ దైనిక విధులనే విస్మరించి ఆమె మోహంలో పడిపోయారు.

ఆయన ఎల్లప్పుడూ దేవదేవి గృహంలోనే ఉండేవారు. కొంత కాలమై ఆయన ఆస్తి అంతా హరించిపోయాక నిర్ధనుడైన ఆయన్ని ఎవ్వరూ లక్ష్యం చేయక ఇంటినుండి తరిమివేశారు. కాని శ్రీరంగనాథస్వామి ఆయన యందు దయ తలచి తన పూర్వ భక్తుడైన ఆళ్వారు పంపినట్లుగా ఆలయానికి చెందిన స్వర్ణపాత్ర నొక దానిని దేవదేవికి కానుకగా పంపించారు. ఆలయంలో స్వర్ణ పాత్ర కనిపించడం లేదని మరునాడు నలుగురికీ తెలిసినప్పుడు అది దేవదేవి ఇంట్లో ఉన్నట్లు ఆలయాధికారులకు ఆమె సన్నిహితుని ద్వారా తెలియగా వారామె ఇల్లు సోదా చేశారు. అప్పుడు దేవదేవి ఆ పాత్రను తనకు కానుకగా తన ప్రియుడైన ఆళ్వారు పంపినట్లు ఆలయాధికారులకు తెలియజేసింది. దాంతో ఆళ్వారును దోషిగా నిర్బంధించారు. కాని శ్రీరంగనాథుడు ఆ రాత్రియే ఆలయాధికారికి స్వప్నంలో కనిపించి ఆ పాత్ర దేవదేవి యింటికి ఎలా చేరినదీ స్వయంగా వివరించాడు. సత్యం తెలిసిన ఆలయాధికారులు తొండరడిప్పొడి ఆళ్వారును విడుదల చేశారు. అప్పటినుండీ దేవదేవీ తొండరడిప్పొడి ఆళ్వారు లిరువురూ మహా భక్తులయ్యారు. భక్తాంఘ్రి రేణువులను తలపై ధరించే నియమ వ్రతాన్నవలంబించి నందువల్లనే (తొండర్ = భక్తుల; అడిప్= పాదముల; పొడి – ధూళి) ఈ ఆళ్వారుకు ఈ పేరు చిరస్థాయి అయింది. ఈయన తిరుమాలై (పూలదండ) తిరుప్పళ్లి ఎళుచ్చి (ఉదయగానము) అను రెండు గ్రంథాలను రచించారు.

తిరుప్పానాళ్వారు అస్పృశ్యుడుగా జన్మించినందువల్ల ఆలయంలో ప్రవేశించే అధికారం లేక కావేరీ తీరంలో నిలబడి భగవంతుణ్ణి ప్రార్థించేవారు. నిత్యమూ నదినుండి ఆలయానికి నీళ్ళు మోసి తెస్తూ ఉండే భగవత్సేవకులైన లోక సారంగముని ఒకనాడు

ఆళ్వారును సమాధి స్థితిలో చూడడం తటస్థించింది. అది సమాధి స్థితియని ఆయనకు తెలియక అస్పృశ్యుణ్ణి దూరం తరిమే దృష్టితో ఒక రాయి ఆళ్వారు పైకి విసిరారు. అది ఆయనకు తగిలి పెద్దగాయమై నెత్తురు కారింది. ఆ రాత్రి రంగనాథస్వామి లోక సారంగమునికి కలలో కనిపించి ఆళ్వారును బుజాల మీద మోసి ఆలయంలోకి తేవలసిందని ఆజ్ఞాపించారు. మరునాడు ఆళ్వారు ఎంత వద్దని నిషేధించినా వినక లోక సారంగముని స్వామి ఆజ్ఞను శిరసావహించి ఆళ్వారును బుజాలపై ఎక్కించుకొని ఆలయంలోకి తెచ్చారు. ఈ ఆళ్వారు చరిత్ర రామానుజాచార్యుల వారికెంతో నచ్చింది. అందుచేతనే వారు దీన్ని పదే పదే ఉదహరించి భగవదనుగ్రహం కొన్ని ప్రత్యేక జాతుల వారికే పరిమితంకాదని తమ దృక్పథాన్ని నిరూపిస్తూ ఉండేవారు.

తిరుమంగై ఆళ్వారు ఒక సామాన్య సామంతరాజు. ఆయన కుముదవల్లి అనే వైష్ణవకన్యను గాఢంగా ప్రేమించారు. 'నీవు దినానికి వేయి మంది చొప్పున ఒక్క సంవత్సరంపాటు భాగవతుల కన్న దానం చేస్తే నిన్ను నేను వివాహమాడతానని' ఆమె షరతు విధించింది. తనకున్న సమస్త ఐశ్వర్యము అయిపోయి గత్యంతరంలేక ఆళ్వారు అన్నదానానికై దోపిడీ వృత్తి నవలంబించాడు. ఒకసారి అరణ్యంలో నూతన దంపతుల రూపంలో విహరిస్తున్న లక్ష్మీ నారాయణులు ఆళ్వారు కంట పడడమూ, ఆయన వారి ఆభరణాలన్నిటినీ అపహరించడమూ జరిగింది. అయితే ఆనాడు తనకు దొరికిన నగల మూటను ఆ దొంగ ఎత్తలేక బిత్తరపోయాడు. ప్రక్కనే నిలబడి వున్న విచిత్ర దంపతుల వంక ఆళ్వారు చూసేసరికి ఆయనకు వివేకోదయమైంది. ఆ క్షణంనుంచీ ఆయన మహావిష్ణు భక్తుడయ్యాడు.

తిరుమంగై అనేక కృతులు రచించారు. ఆయన వేయికి పైగా

గేయ కృతులు రచించినట్లు ప్రతీతి ఉన్నది. వారి రచనల్లో తిరు వేలు కురిరుహాయి, సిరియ తిరుమాడల్, పెరియ తిరుమాడల్, పెరియ తిరుమొళి, తిరుకుఱున్ దండకమ్, తిరునెడుం దండకమ్ ముఖ్యంగా గేయకత్వానికి పేరు పొందాయి. భక్తి సాహిత్యంలో వానితో పోల్చదగినవి లేవనే చెప్పాలి.

పెరియాళ్వారని పేరుపొందిన విష్ణు చిత్తులు శ్రీవిల్లిపుత్తూరు నగరానికి చెందిన బ్రాహ్మణులు. వారు కృష్ణభక్తులలో అగ్రే సరులే కాని వారి విద్యా సంస్కారం సామాన్యమైనది. ఒకప్పు డాయన వేదార్థ వివరణానికి పాండ్య మహారాజు సభకు ఆహూతు లయ్యారు. ఎంత సంకోచించినా కలలో భగవంతుడు కనిపించి ఆజ్ఞాపిస్తే రాజసభకు పోక తప్పిందికాదు. అసాధ్యమనుకున్నది సాధ్యమే అయింది. తక్కిన వారికంటే తనకే ఎక్కువగా వేదార్థం తెలుసునని రాజ సభలో ఆయనకు విదితమయింది. పాండ్యరాజు పరమానంద భరితుడై విష్ణు చిత్తులను పట్టపు టేనుగుపై నెక్కించి పురవీథులలో ఊరేగించాడు. ఆనాడు ఆ మహా భక్తునకు లక్ష్మీ నారాయణుల దివ్యదర్శనమూ లభించింది. దాంతో విష్ణుచిత్తులు ప్రేరణపొంది తిరుప్పల్లాండు అని జగత్ప్రసిద్ధి నందిన దివ్య స్తోత్రాలను గానం చేశారు.

శ్రీ వైష్ణ వాళ్వారులలో ఒక్కతెయే స్త్రీ అయిన ఆండాళ్ విష్ణు చిత్తుని పెంపుడు బిడ్డ. ఆయన ఆమెను సంప్రదాయ మార్గంలో పెంచి పెద్ద చేశారు. శైశవ దశలోనే తనకు కాబోయే భర్త భగవంతుడైన శ్రీ కృష్ణుడే అని నిర్ణయించుకుని ఆ లక్ష్యాన్ని అందుకునేందుకు ఆండాళ్ తన జీవితాన్ని భక్తి తన్మయత్వం తోనూ ఆధ్యాత్మిక పారవశ్యంతోనూ గడిపింది. తండ్రి ప్రతి దినమూ పూలదండలు కట్టి, ఆలయానికి స్వామికోసం తీసుకు వెళుతూ ఉండేవారు. ఆమె వాటిని తన మెడలో ధరించి అద్దంలో తన ప్రతిబింబం చూచుకుంటూ తాను స్వామికి తగునా అని ఆలో

చిస్తుండేది. ఒక రోజున ఆమె ఇలా చేస్తుండగా విష్ణు చిత్తుడు చూసి భగవదపచారమని ఆమెను కఠినంగా మందలించాడు. కాని శ్రీ కృష్ణభగవానుడు ఆయనకు కలలో కనిపించి నిజాని కామె ధరిస్తున్నందు వల్లనే ఆ దండలు తనకు అత్యంత ప్రియము లవుతున్నాయని తెలియజేశారు. అప్పుడు పెరియాళ్వారుకు తన కూతురి మహిమ తెలిసి వచ్చింది. ఆండాళ్ కూర్చిన తిరుప్పావై ఆళ్వారులు చేసిన స్తోత్రా లన్నింటిలోకి పరమ పవిత్రమైనదీ, బహుళ ప్రచారం పొందినదీ. నాచ్చియార్ తిరుమొళి అనే స్తోత్రాన్ని గూడా ఆమె రచించారు.

శఠకోప నామాంతరులైన నమ్మాళ్వార్ పన్నిద్దరాళ్వారులలో ప్రముఖ వ్యక్తులు. ఆయన పుట్టుకతోనే సిద్ధ పురుషులై ఒక చింతచెట్టు కింద సమాధి స్థితినంది కొన్ని సంవత్సరాలు అలా ఉండిపోయారని చెప్పుకుంటారు.

ఉత్తర దేశయాత్ర చేస్తున్న మధురకవి అనే ప్రసిద్ధ మతా చార్యు లొకరు దూరాన ఒక దివ్య జ్యోతిని చూచి తదభి ముఖంగా ప్రయాణం చేశారు. చిట్ట చివరకు ఆయన ఆ వెలుగు నకు మూలమైన చోటు చేరుకుని పరమ గౌరవంతో నమ్మాళ్వా రుకు నమస్కారం చేశారు. ఆ మధురకవి నమ్మాళ్వారును 'జీవాత్మ భౌతిక పదార్థంనుంచి ప్రభావించినట్లయితే అది దేన్ని తింటోంది, ఎక్కడ విశ్రమిస్తోంది?' అని ప్రశ్నించారు. నమ్మా ళ్వారు వెంటనే 'దాన్నే తింటోంది, అక్కడే విశ్రమిస్తోం'దని సమాధాన మిచ్చారు. తచ్ఛబ్ద ప్రయోగంచేత దేశికులుద్దేశించి నదీ, శిష్యున కవగతమైనదీ అంతా భగవన్మయమే అని, నమ్మాళ్వారు మహత్వాన్ని గుర్తించిన మధురకవి అప్పుడే ఆయనకు శిష్యులయ్యారు.

తిరువృత్తమ్, తిరువాసిరియమ్, తిరువాయి మొళి, పెరియ తిరువందాది అనే నమ్మాళ్వారు కృతులు నాల్గింటినీ శ్రీ వైష్ణవులు

ఋగ్యజు స్సామాధర్వణములనే చతుర్వేదాలతోనూ సమానంగా భావిస్తారు.

ప్రతి విష్ణ్వాలయంలోనూ నమ్మాళ్వారు మూర్తి ప్రతిష్ఠితమై అర్పితమవుతోంది. తక్కిన ఆళ్వారులందరూ ఈ ఆళ్వారు అంశావతారాలని నమ్ముతారు.

దివ్య జ్యోతిని దూరాన చూసి దాని మూలాన్ని చేరుకుని నమ్మాళ్వారును గురువుగా స్వీకరించిన మధురకవి చిట్ట చివరి ఆళ్వారు అయ్యారు. కవిగా విస్తృతఖ్యాతి పొందిన ఈ ఆళ్వారు తమ కణ్ణినన్ సిరుత్తాంబు అనే గ్రంథంలో తమ గురువులైన నమ్మాళ్వారును ఎంతో ప్రశంసించారు.

పన్నిద్దరాళ్వారుల స్తోత్రాలను నాలాయిరమ్ అన్న పేరుతో వ్యవహరిస్తారు. దివ్యప్రబంధంలో ఉపనిషత్సారమంతా ఉన్నది. ఆళ్వారులు భగవత్తత్వపు లోతులలోకి పోయి దైవ సాంగత్య తన్మయత్వంలో తాము పొందిన దివ్యానుభూతిని శ్రోతల హృదయాలను ఝల్లుమనిపించే మధుర భక్తి గేయాలుగా రూపొందించగా తరువాత వచ్చిన ఆచార్యులు తాత్త్విక వ్యవస్థ చేసి తమ తమ ఆధ్యాత్మికానుభూతులలో మేళవించి సిద్ధాంత ప్రతిపాదన చేశారు.

ఆచార్యులలో ప్రప్రథములైన నాదముని ఆళ్వారుల స్తోత్రాలనన్నింటినీ సేకరించి ఒక్కొక్క వేదానికి ఒక్కొక్క వేయి ప్రాతినిధ్యం వహించేటట్లు నాలుగువేల స్తోత్రాలు సంకలితం చేశారు.

తంజావూరు జిల్లాలోని మన్నార్గుడి గ్రామంలో క్రీ. శ. 824 లో నాదముని జన్మించారు. వారు జన్మించినప్పటికే ఆళ్వారుల నాలుగువేల స్తోత్రాలు విస్మృతము లయ్యాయని ప్రతీతి. సుదూర దక్షిణ దేశాన్నుండి వచ్చిన భక్తులు కొందరు నమ్మాళ్వారు ద్విపద నొకదాన్ని పాడగా విని ఆ స్తోత్రపు విలువ గుర్తించి ఇది ఒక

మహత్తర నిధిలో భాగమని నాదముని గ్రహించారు. ఆ నిధి నన్వేషిస్తూ ఆళ్వారులు నివసించిన ప్రదేశాలన్నీ పవిత్ర తీర్థ యాత్రా స్థలాలుగా సంచరించి ఎంతో కష్టం మీద నాలుగువేల స్తోత్రాలనూ నాదముని సేకరించారు. ఆయన కృషియే లేకపోతే ప్రపంచాని కీ నిధి దక్కేదేకాదు.

నాదముని మనుమలైన యమునాచార్యులవారు ఆళవందారుగా ప్రసిద్ధులయ్యారు. వారు తమ వైదుష్య బలంచేత వైష్ణవ జ్యోతిని ప్రజ్వలింపజేశారు.

## II

పెరియ తిరుమలైనంబి లేక శ్రీశైల పూర్ణులు ఆళవందారు శిష్యులు. పదిహేను మందిలో ఒకరు. వారు తిరుపతిలో కఠోర నియమవ్రతులై జీవిస్తూ ఒక ఓంక మానవసేవా మరొక ఓంక మాధవసేవా సమృద్ధిగా చేశారు. వారికి కాంతిమతి, శ్రీదేవి అని ఇద్దరు సోదరీమణులున్నారు. కాంతిమతి శ్రీపెరంబూదూరులోని కేశవ సోమయాజులవారి భార్య అయినది. శ్రీదేవి మలవై మంగళానికి చెందిన కమలనయన భట్టరుగారి ధర్మపత్ని అయినది.

సోమ యజ్ఞం చేసిన వారిని సోమయాజి అని పిలుస్తారు. కాంతిమతీ కేశవ సోమయాజులకు వివాహమయి చాలా కాల మయినా సంతానం కలుగలేదు.

కేశవ సోమయాజి పుత్రకామేష్టి చేయగా క్రీ. శ. 1017 లో రామానుజులు జన్మించారు. ఈ వార్త విన్న పెరియ తిరుమలై నంబి తిరుపతి నుండి సోదరి గృహానికి వచ్చారు. మేనల్లుని

శిరస్సు చుట్టూ దివ్యంగా వెలుగుతున్న కాంతి మండలాన్ని గమనించి, అతనిలో శ్రీరామచంద్రుని ప్రియతమ సోదరుడైన లక్ష్మణుని విశిష్ట లక్షణాలు గుర్తించి ఆ బాలునకాయన రామానుజులని నామకరణము చేశారు.

కాంతిమతి చెల్లెలైన శ్రీదేవికి కూడా అనతి కాలంలోనే కుమారుడు కలగగా అతనికి గోవిందుడని పేరుపెట్టారు.

శ్రీ పెరుంబూదూరులోని శ్రీ వైష్ణవులందరూ వచ్చి రామానుజుల నాశీర్వదించారు. వారిలో తిరుక్కచ్చి నంబి కూడా ఉన్నారు. కాంచీ పూర్ణులని నామాంతరమున్న ఈ తిరుక్కచ్చి నంబి కేశవ సోమయాజుల వారికి ముఖ్య స్నేహితులు. వడ్డీ లెక్కల్లో మాత్రమే ప్రావీణ్యంగల వైశ్య కుటుంబానికి చెందిన వారైనా ఆయన వైష్ణవ సంప్రదాయాన్ని భక్తి శ్రద్ధలతో అనుసరించారు. ఒకప్పుడాయన తండ్రి 'నీ సంపద నెక్కడ దాదావురా?' అని అడిగితే ఆకాశం వైపు వేలెత్తి చూపి చిరునవ్వు నవ్వారట. ఆయన కాంచీపురం పొలిమేరల్లో ఒక చిన్న గుడిసెలో ఉంటూ ఆధ్యాత్మిక సాధనలతోనూ భగవత్సేవతోనూ జీవితాన్ని అతి నిరాడంబరంగా గడిపారు. తన్నొకరు గుర్తించాలని ఏ మాత్రమూ అభిలషించక వినయ సౌజన్యాలతో సాధుజీవనాన్ని గడపిన ఆ మహానుభావుడంటే కాంచీపుర జనులకు ఎనలేని గౌరవం.

రామానుజులకు విద్యాభ్యాసం ఆరంభమయిన కొద్ది కాలానికే ఆయన మహామేధావి అనీ, ఆయన విజ్ఞాన తృష్ణను చల్లార్చడానికి శ్రీపెరుంబూదూరు చాలదనీ విస్పష్టమైంది. కంచికి వెళ్లి యాదవ ప్రకాశ పండితులవద్ద శుశ్రూష చేయాలని ఆయన అభిలషించారు.

రామానుజులకు పదహారవయేటనే తంజమ్మతో వివాహమయింది. నెల రోజులు గడచిన వెంటనే కేశవ సోమయాజి హఠాత్తుగా పరమపదించడమూ కుటుంబం యావత్తూ దుఃఖంలో

మునిగిపోవడమూ తటస్థించింది. రామానుజులు దుఃఖోద్వేగాన్ని నిగ్రహించుకొని కుటుంబ భారాన్ని వహించడానికి సిద్ధ మయ్యారు. ఆ చిన్న వయస్సులో రామానుజులు చూపిన వివేక దారుఢ్యానికీ గుండెనిబ్బరానికీ బంధువులందరూ మెచ్చుకున్నారు.

పితృ మరణానంతరం రామానుజులు కుటుంబాన్నంతటినీ కంచికి తరలించడానికే నిశ్చయించారు. తీరని విజ్ఞాన పిపాస వల్ల తమ గురువులైన యాదవ ప్రకాశుల సాన్నిధ్యంలోనే ఎల్లప్పుడూ ఉండాలని ఆయన అభిలషించారు.

యాదవ ప్రకాశులు అద్వైత విద్వాంసులు. వారి పాండిత్య మగాధమైనది. పాఠ ప్రవచనంలో మంచి పేరు పొందిన వారు. వారి వద్ద శుశ్రూష చేయాలని దేశ దేశాలనుండి శిష్యులు వచ్చే వారు.

రామానుజుల పినతల్లి కుమారుడైన గోవిందుడూ, అతని తండ్రి కమల నయన భట్టరూ కూడా యాదవ ప్రకాశుల వద్ద వేదాంత మభ్యసించాలని రామానుజులను త్వరలోనే చేరు కున్నారు.

ఏమైనా యాదవ ప్రకాశులకు రామానుజులపై గల అభిమానం ఎక్కువ కాలం నిలువలేదు. యాదవులు వివరించిన అద్వైత సిద్ధాంతంలోని కేవల బుద్ధి గమ్యవాదాలు రామానుజలకు తృప్తి కలిగించ లేకపోయాయి. ఆయన క్రమ క్రమంగా ధైర్యం వహించి గురువును వ్యతిరేకించ సాగారు.

ఒకప్పుడు గురువు తైత్తిరీయోపనిషత్తులోని 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' అన్నదాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రుతి తాత్పర్యం పరమాద్వైతమని వివరించగా రామానుజులు వెంటనే వ్యతిరేకించి అవి బ్రహ్మమునకు విశేషణములు మాత్రమే అని పరస్పర విరోధం లేకుండా అవి సహ జీవించగలవనీ వాదించారు. ఎర్ర దనమూ, మెత్తదనమూ, సువాసనా ఒక దానితో ఒకటి విరో

ళించకుండా ఒక పువ్వులో ఉంటున్నట్లు బ్రహ్మమునం దీమూడు లక్షణాలూ వేరు వేరుగా ఉండవచ్చునని రామానుజుల వాదం. దీనితో యాదవ ప్రకాశులకు కోపం వచ్చి నీ కిష్టం లేకపోయి నట్లయితే మరొక చోటికి పోవచ్చునని రామానుజులతో స్పష్టంగా అన్నారట. శిష్యుడా తరువాత గురువుతో వాదించక మౌనం వహించాడట.

మరొక రోజున రామానుజులు గురువుల శరీరానికి తైలం రాసి మర్దన చేస్తూ ఉండగా గురువుగారు 'తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ' అనే ఛాందోగ్య వాక్యాన్ని వ్యాఖ్యా నిస్తూన్నారు. అందులో ఆయన బ్రహ్మము కళ్ళు కోతి వెనుక భాగం వలె వున్నదని వివరించారట. ఆ వివరణానికి రామా నుజులు నిర్ఘాంతపోవడమే కాక ఆయన కళ్లవెంట నీళ్లు బొట బొటకారి యాదవుల తొడమీద పడ్డాయట. ఆయన వెంటనే తల యెత్తి చూచి ఎందుకలా దుఃఖిస్తున్నావని శిష్యుణ్ణి అడిగారు. రామానుజులు వినయంగానే 'మీరు చేసిన వివరణం తప్పు స్వామీ! అది అసందర్భమే కాక నీచ ఉపమానం అవుతుంది' అన్నారు. దాంతో యాదవులు తమకు వచ్చిన కోపాన్ని ఆపుకో లేక 'అయితే సరి అయిన వివరణమేమిటంటా?' వని గద్దించా రట. 'అయ్యా! కప్యాసమనగా సూర్యునిచే ఉన్మీలితమని అర్థం. పుండరీకమంటే పద్మమన్నది ప్రసిద్ధమే గదా. అప్పుడా వాక్యానికి భగవంతుని నేత్రములు ప్రాతస్సూర్య వికసితాలయిన పద్మాలవంటి వని తాత్పర్యమవుతుంది.' అని మనవి చేశారట రామానుజులు. యాదవు లాగ్రహంపట్టలేక నేను చెప్పిన అర్థాన్ని అంగీకరించ లేకపోతే నీవు వెళ్లిపోవచ్చు నన్నారట. దాంతో రామానుజులు తమ మనసులో ఉన్నదున్నట్లుచెప్పి గురువును విడిచి వెళ్లిపోయారు. ఆ తరువాత వారిరువురి సంబంధమూ సవ్యంగా సాగలేదు.

ఈ రామానుజు లిట్లాగే కొనసాగితే అద్వైతానికి ప్రబల విరోధి అవుతారనీ, అతి పురాతన కాలం నుంచీ వస్తున్న ఈ సిద్ధాంతాన్ని నిలబెట్టడానికి దిన దినమూ బలీయుడవుతున్న ఈ చిన్నవాని నోరు శాశ్వతంగా నొక్కివేయక తప్పదనీ యాదవ ప్రకాశులకు గట్టి నమ్మకం కలిగింది.

అందుచేత ఆయన తన తక్కిన శిష్యులను సమావేశపరచి వారితో ఈ విషయమై సంప్రతించారు. వారందరూ గూడా గురువుగారితో పాటు రామానుజు లెప్పటికైనా అద్వైతాన్ని తిర స్కరించి తమ సిద్ధాంతాన్ని తాము ప్రతిపాదిస్తారని అంగీకరించారు. అప్పుడు వెంటనే యాదవులు 'గంగానదిలో మన పాపాల నన్నింటినీ ప్రక్షాళన చేసుకోవడానికి తీర్థయాత్ర బయలుదేరుదాము. మనతో రామానుజాన్ని గూడా తీసుకుపోదాము. దారిలో ఈ దుర్బుద్ధిని (రామానుజాన్ని) వదలించుకుని ఈ పాపాన్ని కూడా పవిత్ర భాగీరథీ జలాలతో కడిగి వేసుకుందాము. అద్వైతం దక్కాలంటే ఈ పనిచేసి తీరవలసిందే' అని అన్నారుట! శిష్యులందరూ గురువుగారి పథకంతో ఏకీభవించారుట! వారిలో ఒకడు రామానుజులను గంగా స్నానానికి రమ్మని ప్రోత్సాహించడానికి వెళ్ళాడు.

ఏదో కుట్ర జరుగుతోందని గ్రహించిన గోవిందుడు సరియైన సమయంలో రామానుజులను హెచ్చరించ వచ్చునని తాను గూడా ఆయన వెంట వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

యాత్రికులందరూ వింధ్య పర్వతాలు చేరుకుని అక్కడ విశ్రాంతికై ఆగారు. ఆ ప్రాచీన పర్వతాల అపూర్వ శోభా విశేషం రామానుజుని కళాధార్మిక దృష్టికి పారవశ్యాన్ని కల్గించింది. భగవంతుని అనంత చిద్విలాసానికి ప్రతినిధియైన ఆ ప్రకృతి శోభ భక్తి భావనలో ఆయనను అత్యున్నత శిఖరాలకు చేర్చింది. రానున్న అపాయాన్ని గూర్చి ఏ మాత్రమూ తెలియని ఆ అమాయి

యికుడు, ఏదో ఆ విష్ణునివలె ఆత్మారాముడై తనలో తానే ముచ్చటిస్తూ మహారణ్య మధ్యంలోకి వెళ్ళాడు.

తనకు తెలిసిన రహస్యాన్ని రామానుజుల కెట్లా చెప్పటమా అని ఇంతవరకూ ఆందోళన చెందుతున్న గోవిందుడు ఇప్పుడు చెప్పి తీరాలని నిశ్చయించు కున్నాడు.

ఉదయం లేస్తూనే బయలుదేరిన రామానుజులు ఒక సెల యేటి సమీపానికి పోయి ఎటు చూచినా పచ్చటి పసిమీ, గలగల పారే సెలయేరూ, పక్షుల కిలకిలలూ, ఎత్తైన కొండలూ, అరుణోదయ రాగరంజితమైన విశాలాకాశమూ చూస్తూ తన్మయులై నిలబడ్డారు. మెల్లగా ఆయన్ని సమీపించిన గోవిందుడు వెనుక నుండి మృదువుగా స్పృశించాడు. ఆ సమయంలో అతనక్కడికి వస్తాడని రామానుజులు ఊహించలేదు. ఆయన ఆశ్చర్యాన్ని ప్రకటించగా కంచిలో బయలుదేరకముందే తనకు తెలియ వచ్చిన కుట్రను గూర్చి గోవిందుడు విశదీకరించి ఈ యాత్రా మండలిని విడిచి వెళ్లిపొమ్మని బతిమాలాడు.

గోవిందుడు చెప్పినది విని రామానుజులు చకితులయ్యారు. తన గురువింతటి దారుణానికి తెగిస్తారని ఆయన ఊహించ లేదు. యాదవ ప్రకాశులు తామనుకున్నట్లే చేయగలిగితే అంత కంటె నిష్కృతిలేని మహా పాపం మరొకటి ఉండదు. అంతటి మహా పాపంనుంచి ఆయన్ని రక్షించడానికి గోవిందుని సూచన ననుసరించి తాను ఒంటరిగా వెళ్లిపోవడ మొక్కటే మార్గమని రామానుజులు నిశ్చయించుకున్నారు.

ఆ దుర్గమారణ్యంలో ఏకాకిగా దారి తెలుసుకుని వెళ్లగల గడం సామాన్యమైన విషయం కాదు. ఎటు చూచినా గాఢాంధ కారం తనను అలముకున్నట్లయింది. అంతలో తెల్లవారింది. ఆయనకెక్కడలేని ధైర్యమూ వచ్చింది. దైవాన్ని నమ్మిన వానికి

ఏ భయమూ లేదని అంతరాత్మ ప్రబోధం వినిపించింది. ఆయన నిర్విరామంగా నడక సాగించారు.

రామానుజులు కనిపించక అతన్ని గూర్చి విచారించిన యాదవ ప్రకాశులకు అతడు ఒంటరిగా అడవిలోకి వెళ్లినట్లు తెలిసింది. శిష్యులన్ని వైపులకూ పోయి గొంతులెత్తి కేకలు వేస్తూ అతనికై అన్వేషించారు. ఫలితం శూన్యంకాగా రామానుజుడు ఏ హింసక మృగానికో ఆహుతి అయి ఉంటాడని యాదవులు నిశ్చయించుకున్నారు. అనుకోకుండా కలిసి వచ్చిన ఈ అదృష్టానికి ఆయన సంతోషించి ఇక ఈ శిష్యుని బెడద తీరిపోయిందని ఊరట పొందారుట!

గంటల తరబడి నడచి నడచి అలసిపోయిన రామానుజులు యావచ్ఛరీరమూ తూలుతుండగా ఒక చెట్టు కింద నీరసంతో కూలబడిపోయారు. తరువాత ఆయన ఒళ్లు ఆయనకు తెలియలేదు.

ఉలికి పాటుతో ఆయనకు మెలకువ వచ్చింది. తనవంక జాలితో ప్రేమతో ఆప్యాయంగా చూస్తున్న కిరాత దంపతులు ఎదురుగా కనిపించారు.

'దారి తప్పారా నాయనా?' అని కిరాతు డడిగాడు.

'అవు' నన్నారు రామానుజులు.

'మీ దేవూరు బాబూ?' అని ఎంతో సానుభూతితో ప్రశ్నించాడు కిరాతుడు.

'దక్షిణాన కాంచీపురం' అన్నారు రామానుజులు.

తన ప్రేయసి వంక చూసి చిరునవ్వు నవ్వి ఒక నిమిషం ఆగి 'మేము రామేశ్వరం దాకా వెళుతున్నాము. మాతో రా, నిన్ను కంచిలో దింపుతాము' అన్నాడు బోయవాడు.

నల్లగా, పొడుగ్గా, ఎఱ్ఱటి కళ్ళతో భయం కలిగించే కిరాతుల దర్శనమూ, వారితో వెళ్ళవలసి రావడమూ శ్రేయస్కరం కాక పోయినా రామానుజుల కా సమయంలో గత్యంతరం లేక

పోయింది. వారితో కలిసి ఒక గంట ప్రయాణం చెయ్యగా ఒక నదీ తీరాన్ని చేరుకున్నారు.

ఎగుడు దిగుడుగా ఉన్న ఒక ప్రదేశాన్ని చదును చేసి కిరాతుడు రామానుజుల నక్కడ ఆ రాత్రికి విశ్రమించమన్నాడు. ఆ దంపతులు మరొక ప్రక్కకుపోయి విశ్రమించారు.

అర్ధరాత్రి సమయంలో 'నాకు దాహం వేస్తోంది' అని కిరాతి భర్త నడగడం రామానుజులకు వినిపించింది.

'ఈ దగ్గరలోనే నుయ్యి ఒకటి ఉండాలి. ఈ కటిక చీకటిలో ఇప్పుడక్కడికి వెళ్ళడం మంచిది కాదు. తెల్లవారనీ చూద్దాము' అన్నాడు కిరాతుడు.

ముందుగా నిద్రలేచి ఆమెకు నీళ్ళు తెచ్చి పెట్టాలని రామానుజు లనుకున్నారు. అనుకున్నట్లుగా ఆయన తెల్లవారక ముందే లేచి నూతి దగ్గరకు వెళ్ళి నీళ్ళు తెచ్చారు. కాని ఆ కిరాత దంపతులు కనిపించలేదు. వారికోసం ఆ చుట్టు పక్కల ఎంత వెతికినా ప్రయోజనం లేకపోయింది.

అంతకంటే ఆశ్చర్యకరమైన విషయం ఎదురుగా తీర్చి దిద్దిన వరుసలూ, ఆలయ గోపురమూ సాక్షాత్కరించాయి.

రామానుజుల కప్పుడు తామున్నది కంచిలోనని తెలిసి వచ్చింది. అయితే మరి ఈ కిరాత దంపతులెవరు? ఆయన ఆశ్చర్యానికి అవధి లేకపోయింది.

అప్పుడు వారికి శ్రీ విష్ణు పురాణంలోని ఒక శ్లోకం జ్ఞప్తికి వచ్చింది.

"నమో బ్రహ్మణ్య దేవాయ
గో బ్రాహ్మణ హితాయచ
జగద్ధితాయ కృష్ణాయ
గోవిందాయ నమో నమః॥

గోవులకూ బ్రాహ్మణులకూ హితాన్ని కలిగిస్తూ సర్వ

జగత్తునూ సంరక్షించే బ్రహ్మణ్య దేవుడైన గోవిందునకు "శ్రీకృష్ణ పరమాత్మకు నా పునః పునః ప్రణామములు."

## III

రామానుజుల తల్లి యైన కాంతిమతి కొడుకంత త్వరలో, అందు లోనూ ఒంటరిగా, తిరిగి వస్తాడని అనుకోలేదు. రామానుజులు జరిగినదంతా తల్లితో చెప్పి యాదవులు ఎట్లాగైనా తమ గురువులు కాబట్టి వారి పేరు కెట్టి కళంకమూ రాకూడదనీ, అందుచేత ఈ విషయం రహస్యంగా ఉండవలెననీ ఆమెను ప్రార్థించారు.

అతని పినతల్లి, (గోవిందుని తల్లి) శ్రీదేవి రామానుజులు తిరిగి వచ్చిన వార్తవిని ఆయనను ఆశీర్వదించింది. తన కుమారుడు ఆయన ప్రాణ రక్షణ గావించినందుకు ఆమె పరమానంద భరితురాలయింది.

మూడు నెలలు తర్వాత యాదవులు కంచికి తిరిగి వచ్చి తమ కంటె ముందుగా రామానుజులు వచ్చిన వార్త విన్నారు. తమ శిష్యుడు మహారణ్య మధ్యంలో క్రూర మృగాల కాహుతి అయినా డన్న ఊహలోనే వారున్నారు. ఇప్పుడాయన తమ కుట్ర సంగతి రామానుజులకు తెలిసిందేమో అన్న ఆందోళనలో పడ్డారు.

రామానుజులకు కబురంపగా ఆయన యాదవుల వద్దకు వచ్చారు. తమ మీద రామానుజులకు కోపమేర్పడిన సూచన లేమీ యాదవులకు కనిపించలేదు. రామానుజులు ఎప్పటివలెనే మందస్మిత వదనులై ఉన్నారు. తిరిగి ఆయనను చూడగలిగి నందుకు తమ సంతోషాన్ని ప్రకటించి పూర్వంవలెనే తమ శిష్య మండలిలో చేరమని యాదవులు చెప్పారు. రామానుజు లంగీ కరించారు.

గోవిందుడు వచ్చేదారిలో కాళహస్తిలోనే ఆగిపోయినట్లు తోటి యాత్రికుల వల్ల రామానుజులకు తెలిసింది. గంగాస్నానం చేస్తుండగా గోవిందునకొక శివలింగం లభించిందట. అప్పటి నుండీ అతడు పూర్తి శైవుడయ్యాడట. ఆ లింగాన్నతడు కాళ హస్తిలోనే ఒక ఆలయంలో ప్రతిష్ఠించి అక్కడనే ఉండి పోయాడట.

రామానుజులు యాదవుల వద్ద వేదాంత శ్రవణం పునః ప్రారంభించాక మళ్లీ ఇబ్బందులు రాసాగాయి. ఉపనిషత్తులకు గురువులు చేస్తున్న వ్యాఖ్యానాలు శిష్యునకు నచ్చడం లేదు. ఆయన బహిరంగంగానే వ్యతిరేకించసాగారు.

కంచికి సమీపంలో ఒక సామంత రాజున్నాడు. ఆయన కుమార్తెకు బ్రహ్మ రాక్షసి పట్టింది. దాన్ని వదిలించమని యాదవులను ప్రార్థించారు. యాదవులా ప్రయత్నంలో రామానుజు లను వెంటబెట్టుకుని వెళ్ళారు. ఆయన ఏవో మంత్రాలు వల్లించారు గానీ రాజకుమారి పరిస్థితి మరింత ప్రమాదకర మయింది. అప్పుడు రామానుజులు భగవద్భక్తితో చికిత్స చేయగా ఆమె ఆరోగ్యం బాగుపడి పూర్వస్థితికి వచ్చిందట. యాదవులకు శిష్యుడంటే అసూయ ప్రబలి ఇంటికి తిరిగి వచ్చాక ఆయనను తిరిగి పంపించి వేశారట.

రామానుజులప్పుడు తిరుక్కచ్చి నంబి నాశ్రయించగా ఆయన స్వాగతమిచ్చి శిష్యుణ్ణిగా స్వీకరించడానికి ఆనందంతో అంగీక రించారు. ఆయన ఆలయంలో తిరుమంజనానికి (దేవతా మూర్తుల స్నానము) నూతి నుండి నీళ్ళుతోడి తెచ్చే పని రామానుజుల కప్పగించారు. ఆళవందారు తరువాత రామానుజుల నాయ కత్వంలో వైష్ణవ మత భవిష్యత్తు సురక్షితంగా ఉండగలదని తిరుక్కచ్చినంబి గాఢంగా విశ్వసించారు.

రామానుజులను గూర్చి ఆళవందారుకు కూడా అనేక విషయాలు

తెలిశాయి. ఒకప్పుడాళవందారు కంచికి వెళ్ళగా యాదవప్రకాశుల శిష్యవర్గంలో ఉన్న రామానుజుల నెవరో దూరంనుండి ఆయనకు చూపించారు. విశాల భుజస్కంధాలలో గంభీరమైన ఆ మూర్తిని చూసి అతడు జన ప్రియనాయకుడవడానికే జన్మించిన వాడని తలపోసి వైష్ణవ ధర్మజ్యోతిని ప్రజ్వలింపజేసే సామర్థ్యం అతనికి ప్రసాదించాలని భగవంతుణ్ణి అప్పుడే ఆయన ప్రార్థించారు. ఆ ప్రార్థన ఫలోన్ముఖ మయ్యే సమయం ఇప్పుడాసన్న మయింది.

రామానుజులు యాదవ ప్రకాశుల శుశ్రూష విడిచి తిరుక్కచ్చి నంబి నాశ్రయించిన వార్త విని శ్రీరంగంలో ఉన్న ఆళవందారుకు పరమానందమయింది. వార్థక్యం కలిగి జీవితాంత్యం సమీపించిందని ఆయన గ్రహించారు. వారు తమ శిష్యుల నందరినీ సమావేశపరచి "భగవంతుడే మన ప్రాణాలకు ప్రాణం. భగవంతునకు సర్వాత్మనా తన్నుతా నర్పించుకున్న వాడే నిజమైన భక్తుడు. భగవంతుణ్ణి నమ్మక పోవడమంటే తన యందే తనకు నమ్మకం లేదన్న మాట. మన విజ్ఞానాని కంతటికీ పరమార్థం ఆ భగవంతుడే. మన మా యనలో ఉన్నాము, ఆయన మనలో ఉన్నాడు. తోడి మానవులకు సేవ చేయడానికే మన జన్మ లుద్దేశింపబడ్డాయి. మానవ సేవలో నిమగ్నం కావడమే నిజమైన ఆధ్యాత్మికత్వం." అని తమ సందేశాన్ని వివరించారు. ఆ తరువాత ఆలయంలోకి వెళ్ళి ముకుళిత హస్తాలతో స్వామికి నమస్కరించి మఠానికి తిరిగి వచ్చారు. శ్రీరంగంలోని శ్రీ వైష్ణవుల కందరకూ సాష్టాంగ నమస్కారం చేసి తమ వల్ల ఏ అపచారం జరిగిఉన్నా క్షమించవలసిందని వినయ పూర్వకంగా వేడుకున్నారు. తమ అంత్య కాలం సమీపిస్తోందని వారు సూచించినప్పుడు శిష్యులందరి నేత్రాలూ బాష్పజల పూరితాలయ్యాయి.

తమ ప్రధాన శిష్యుడైన పెరియనంబిని (మహా పూర్ణులు)

పిలిచి కంచినుండి రామానుజులను తెమ్మని ఆజ్ఞాపించారు. పెరియ నంబి వెంటనే శ్రీరంగంనుండి బయలుదేరి కంచి చేరుకున్నారు. వారు సరాసరి ఆలయానికి వెళ్ళి వరదరాజ స్వామిని సేవించుకుని తిరుక్కచ్చి నంబిని దర్శించి తాము కంచి కెందుకు వచ్చిందీ మనవిచేశారు. తమ తరువాత తమ స్థానాన్ని ఆక్ర మించవలసిన ఉత్తరాధికారి విషయంలో ఆళవందారు చేసిన నిర్ణయం సర్వోత్తమంగా ఉన్నదని తిరుక్కచ్చినంబి ప్రశం సించారు.

మరునాటి ఉదయం నూతినుండి ఆలయానికి నీళ్ళు మోసి తెస్తున్న రామానుజుల మహోన్నత విగ్రహాన్ని పెరియనంబి చూచారు. ఆ మూర్తి ఔన్నత్య గాంభీర్యాలకు చకితులై పెరియ నంబి ఆళవందారు రచించిన స్తోత్రరత్నమనే మహా స్తోత్రాన్ని ఉచ్చైస్స్వనంతో గానం చేశారు.

రామానుజుల నడక స్తంభించింది. ఆ అమర స్తోత్రం చెవిని పడడంతోనే ఆయన ఉన్నచోట ఉన్నట్లే నిలబడిపోయి తన్మ యత్వంతో నిశ్చలులయ్యారు. స్తోత్రమంతా అయిన తరువాత మెల్లగా పాడిన వారిని సమీపించి ఆ స్తోత్ర కర్త ఎవరని ప్రశ్నించారు. దాన్ని వ్రాసింది ఆళవందారు అని వినగానే ఆయన ఆనందానికి అవధిలేకపోయింది. తిరుక్కచ్చినంబి అనేక సంద ర్భాల్లో వారిని ప్రశంసించగా రామానుజులు విని ఉన్నారు. ఆళవందారును చూడవలెనని ఆయన తహ తహ లాడసాగారు.

ఆళవందారు మృత్యు ముఖంలో ఉన్నారనీ, రామానుజులను గురు సన్నిధికి తీసుకుపోవడానికే తాము వచ్చినట్లూ పెరియ నంబి చెప్పారు.

శ్రీరంగం సమీపిస్తుండగానే మహాజన సమూహం చేరి ఉండడం కనిపించింది. రామానుజులు విచారణ చేయగా మహా త్ములైన ఆళవందారు పరమపదించినట్లు తెలిసింది. రామానుజులు

తమ దుఃఖాన్ని నిగ్రహించుకోవడం సాధ్యమే కాలేదు. ఆళవందారు దర్శనం చేసుకోవాలని తాము కంచినుండి కష్టపడి వస్తే ఆయన కళేబరాన్ని మాత్రమే తాము చూడ గలిగారు.

శ్రీరంగంలోని శ్రీవైష్ణవులందరూ ఆళవందారుకు తమ అంతిమ శ్రద్ధాంజలి సమర్పించేందుకు అక్కడ పోగయ్యారు.

ఆళవందారు శరీరంవంక చూస్తూ ఉండగా ఆయన కుడిచేతి మూడు వేళ్ళు ముడుచుకొని ఉండడం రామానుజులకు కనిపించింది. ఆళవందారు శిష్యుల దృష్టి కీ విషయాన్ని రామానుజులు తెచ్చారు కాని వారెవ్వరూ దానికి కారణం చెప్పలేకపోయారు. వారందరూ ఆళవందారు బ్రతికి ఉండగా ఆయన చేతి వేళ్ళు మామూలుగా ఉండేవని మాత్రమే చెప్పారు. రామానుజులు కొంచెంసేపు ధ్యానమగ్నులై ఆళవందారుకు తీరని కోరిక లేవో ఉండి ఉంటాయని సూచించారు. అప్పుడాయన శిష్యులలో ఒకరు ఆళవందారు తరచు మూడు వాంఛలను ప్రకటిస్తూ ఉండేవారని వివరించాడు. వ్యాసపరాశరులకు శాశ్వత స్మృతి చిహ్న మొకటి ఏర్పాటు చేయాలనీ, తమిళ మహా కవులలో అగ్రేసరులైన నమ్మాళ్వారునకు ప్రేమ గౌరవాలను సమర్పించాలనీ, బ్రహ్మ సూత్రాలకు విశిష్టాద్వైత పరంగా వ్యాఖ్యానం వ్రాయాలనీ ఆయన ఎంతో కలవరించారట. అయినా ఆళవందారు తాము జీవించి ఉండగా ఈ మూటిలో దేనినీ సాధించలేకపోయారు.

రామానుజులు ఈ మూడు లక్ష్యాలనూ సాధించాలని శపథం పూనారు.

ఆళవందారు అంత్యక్రియలు సముచితంగా పూర్తిఅయినాయి. రామానుజులు కంచికి తిరిగి వచ్చారు.

రామానుజులిప్పుడు బ్రహ్మసూత్ర భాష్య రచనకుపక్రమించా లని నిశ్చయించుకున్నారు. మహామహులైన శంకరులను ప్రత్యా

ఖ్యానం చేయాలంటే వారితో సమానమైన పాండిత్యాన్ని సాధించాలి. ఈ లక్ష్య సిద్ధికై రామానుజులు తమ కాలాన్నంతటినీ అధ్యయనానికీ, తత్త్వ చింతనకూ వినియోగించసాగారు.

## IV

సత్యాన్ని వివరించమని ప్రార్థిస్తూ రామానుజులు తిరుక్కచ్చినంబినాశ్రయించారు. రామానుజులకున్న ఆరు సందేహాలనూ గురువు సమర్థంగా తీర్చారు. వారు చెప్పిన ప్రధానాంశాలు—

1) అహమేవపరం తత్త్వమ్-నేనన్నదే పరమ తత్త్వము-
2) దర్శన మథ భేదమేవచ – దర్శనమంటే భేదమన్న మాటే.
3) ఉపాయైశ్చ ప్రపత్తి స్యాత్ - జీవుడు ముక్తుడై భగవంతుణ్ణి చేరడానికి ప్రపత్తియే ఉపాయము.
4) అంతిమ స్మృతి వర్జనమ్ - అంత్యకాలంలో భగవత్స్మృతి ఉండి తీరాలని నియమం లేదు.
5) దేహావసానే మోక్షంచ – దేహమునుండి విడుదలపొందడమే మోక్షము.
6) మహా పూర్ణమ్ సమాశ్రయ - పెరియనంబిని గురువుగా స్వీకరించు.

తిరుక్కచ్చినంబి ద్వారా భగవంతుడు తెలిపిన ఈ ఆరు ఉపదేశాలకూ రామానుజు లానందభరితులయ్యారు. అయితే యిక నుండి కాంచీపుర మహాత్ముడు తమకు గురువుగా వుండరని కొంచెంగా బాధ పడ్డారు. కాని పెరియనంబి నుండి తామెంతో తెలిసికొనవలసి ఉన్నందువల్ల ఆళవందారు ముఖ్య శిష్యులైన

వారి నాశ్రయించేందుకు రామానుజులు వెంటనే శ్రీరంగానికి బయలుదేరారు.

ఆ సమయంలో శ్రీరంగంలోని వైష్ణవ మండలి యావత్తూ ఆళవందారు తరువాత అంతటి సమర్థుడూ, తేజస్వి అయిన నాయకుడు కావలసిన అవసరాన్ని గుర్తించింది. ఈ విషయంలో వారు పెరియనంబి సహాయాన్ని కోరి ఆళవందారు అనుగ్రహానికి పాత్రులై వారిచే స్వయంగా పేర్కొనబడిన రామానుజుల వారిని కంచినుండి తీసుకు తెమ్మని ప్రార్థించారు.

పెరియనంబి భార్యా సహితులై బయలుదేరి కంచికి వెళుతూ దారిలో మధురాంతకం చేరుకున్నారు. అక్కడ వారొక రోజు ఆగి కోదండరామ స్వామిని సేవించుకున్నారు.

కంచినుండి శ్రీరంగానికి వెళుతున్న రామానుజులు కూడా మధురాంతకంలో ఆగి అక్కడ పెరియనంబి దర్శనం లభించినందుకు ఆశ్చర్య చకితులయ్యారు. వారిని చూస్తూనే సాష్టాంగ పడి తమ్ము శిష్యుణ్ణిగా అంగీకరించవలసిందని వినయ పూర్వకంగా ప్రార్థించారు.

పెరియనంబి రామానుజులను ప్రేమతో ఆలింగనం చేసుకొని ఆయనను ఆలయంలోని వకుళ వృక్షచ్ఛాయకు తీసుకువెళ్లారు. పాంచరాత్రాగమ ప్రోక్త దీక్షా ప్రధాన విధి ననుసరించి చేయవలసిన అయిదు సంస్కారాలూ నిర్వర్తించి ఆళవందారు పరమానుగ్రహాన్ని వారి కందించారు. తరువాత ప్రమాణ, ప్రమేయ ప్రమాతలనే తత్త్వత్రయాన్ని వారికి వివరించారు. ప్రమాణ మనగా శ్రుతి. ద్వయమంత్రమే ఆ శ్రుతి సారమూ, పరమార్థమూ. భగవంతుడే ప్రమేయము. జిజ్ఞాసాపరుడై భగవత్తత్త్వమును చేరుకునే గురువే ప్రమాత.

ఈ విధముగా మంత్ర రత్న దీక్ష పొందిన తరువాత రామానుజులవారు తమ గురువునూ గురుపత్నినీ తమతో కంచికి

వచ్చి తమ ఆతిథ్యాన్ని స్వీకరించమని వేడుకున్నారు. వారి అభీష్టాన్ననుసరించి పెరియనంబి భార్యా సహితులై కంచిలో ఆరు నెలలున్నారు. ఆ కాలంలో వారు ద్రవిడ వేదమైన నాలుగు వేలలోని మూడు వేల మంత్రాలనూ, వ్యాసకృత బ్రహ్మ సూత్రాలనూ రామానుజుల కుపదేశించారు.

ఈ సందర్భంలోనే రామానుజులకు వారి భార్యయైన తంజమ్మతో మనస్పర్థం ఏర్పడింది. ఆమె పుట్టింటికి వెళ్ళి పోయింది. రామానుజుల కామెతో పదహారవ యేటనే వివాహం జరిగింది. ఆమె మొదటినుంచీ పతితో ఏకీభవించ లేకపోయింది.

మూడు సందర్భాలలో ఆమె భర్తృ వాంఛకు భిన్నంగా ప్రవర్తించినట్లు చెప్పుకుంటారు. వైశ్యులైన తిరుక్కచ్చినంబిని రామానుజులొకమారు తమ యింటి విందు కాహ్వానించారు. తంజమ్మకిది యిష్టం లేకపోయినా ఆమె అభ్యంతర మేమీ ప్రకటించలేదు. రామానుజులు స్నాన పూజాదికం ముగించుకుని అతిథులను తీసుకువద్దామని బయలు దేరారు. కాని తిరుక్కచ్చి నంబి అంతకుముందే బయలుదేరి మరొక మార్గంలో రామా నుజుల ఇల్లు చేరుకున్నారు. రామానుజులు ఇంట్లో లేకపోవడం తెలుసుకుని తాము ఆలయానికి భగవత్సేవకై త్వరగా వెళ్ళాలి కాబట్టి ముందు తమకు వడ్డించమని గృహిణి నడిగారు. ఆమె అలాగే చేసింది. వారు వెళ్ళిపోయాక ఆయన భోజనం చేసిన విస్తరిని కర్రతో మూలకునెట్టి ఆ చోటు శుభ్రంచేసి ఆవు పేడతో అలికి ఆమె కూడా శుద్ధి స్నానం చేసింది. రామానుజులింటికి వచ్చి ఆమె రెండవ సారి చేసిన స్నానానికి కారణం విని నిర్ఘాంత పోయారు.

మరొక సందర్భంలో క్షుధార్తులైన శ్రీవైష్ణవులొకరు రాగా వారికి భోజనం పెట్టమని రామానుజులు భార్యతో చెప్పారు. ఇంట్లో ఒక్క గింజ కూడా లేదని ఆమె భర్తతో అన్నది. ఆయన

వెళ్ళి వంట ఇంట్లో వెతకగా దాచిపెట్టిన బియ్యం కనిపించాయి. అప్పుడు గూడా రామానుజులు కోపాన్ని నిగ్రహించుకున్నారు.

ఆమె చేసిన మూడవ తప్పు ఆతని పరిత్యాగానికి దారి తీసింది. అది ఏమనగా వెనుక చెప్పినట్లుగా పెరియనంబి తమ భార్యతో రామానుజుల కతిధులుగా ఉంటూ వారికి దివ్య ప్రబంధాన్నీ శాస్త్రాలనూ బోధిస్తున్నారు. ఆ రోజుల్లో తంజమ్మతో పాటు పెరియనంబి భార్య గూడా నీళ్ళు తేవడానికి నూతికి వెళుతూ ఉండేవి. ఒక రోజున వారిరువురి మధ్యా బిందె నెవరెత్తుకోవాలని పేచీ మొదలయి తంజమ్మ కొంచెం మాటలు మీరడం సంభవించింది. ఈ సంగతి తెలిసిన వెంటనే తమ శిష్యుణ్ణి ఇంకా ఇబ్బంది పెట్టడం భావ్యం కాదని పెరియనంబి వెంటనే బయలు దేరి వెళ్ళిపోయారు. రామానుజులు ఇంటికి వచ్చి గురువు కంచి విడిచి వెళ్ళిపోయిన వార్త తెలుసుకుని చాలా బాధపడ్డారు. అప్పుడే రామానుజులు భార్యను పుట్టింటికి వెళ్ళి పొమ్మని ఆదేశించి తాము సన్యాసం పుచ్చుకున్నారు. అప్పటి నుండే వారికి యతిరాజ ప్రశస్తి సిద్ధించినది.

## V

రామానుజులు స్వయంగా శ్రీ వరదరాజ స్వామి వారి నుండే ఆశ్రమ దీక్షా స్వీకారం చేశారు. ఆ రోజుల్లో అద్వైత సంప్రదాయాన్ననుసరించి నాలుగవ యాశ్రమ ప్రవేశానికి సన్న్యాసిని గురువుగా అంగీకరించి వారినుండి దీక్ష స్వీకంచడం ఆనవాయితిగా ఉండేది. రామానుజులు అంత చిన్న వయస్సులో సన్యాసాశ్రమం స్వీకరించడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఆలయానికి సమీపంలోనే రామానుజులు వొక మఠాన్ని నెల

కొల్చారు. దేశంలో అన్ని మూలలనుండీ ఆయనను చూడడానికి జనం తండోప తండాలుగా రాసాగారు. కొందరు ఉత్సాహ వంతులైన శిష్యులు ఆయన దగ్గిర చేరారు. అందరికంటె ముందు ఆయన మేనల్లుడు దాశరథి ప్రథమ శిష్య డయ్యాడు. ఈ దాశరథికే ముదలి యాండన్ అని ప్రసిద్ధనామం ఏర్పడింది. త్వరలోనే వేద వేదాంతాలలో నిష్ణాతులయ్యారు. నిత్యమూ రామానుజులను అనుసరించే ఉండేవారు.

హారీత గోత్రీకుడైన కూరేశుడు కాంచీపురానికి చెందిన ధన వంతుడైన భూస్వామి. ఆయన రామానుజుల ద్వితీయ శిష్యు లయ్యారు. ఆ కథ ఇలా ప్రచారంలో ఉన్నది.

కూరేశుల గృహం ఎల్లప్పుడూ గ్రుడ్డి, కుంటి మొదలైన అవిటి వారికీ, బీదలకూ పగలనక రాత్రనక ఆశ్రయమిస్తూ ఉండేది. ఆయన రామానుజులను దర్శించిన వెంటనే తన సర్వస్వాన్నీ పరి త్యజించి గురుసన్నిధి చేరుకోవాలని నిశ్చయించుకున్నారు. ఆ ప్రకారంగానే ఆయన తన ఐశ్వర్యాన్నీ ఇంట్లో ఉన్న వస్తు సామగ్రినీ బీదలకు దానం చేసి భార్యయైన అండాళ్‌తో సహా రామానుజ మఠానికి బయలుదేరారు.

అది రాత్రివేళ. వారుభయులూ మహారణ్య మధ్యంలో ప్రయాణం చేస్తున్నారు. ఇంతటి కష్టప్రయాణ మెన్నడూ చేసి ఎరుగని ఆ ఇల్లాలు ఆందోళన చెంది "ఇటువంటి ప్రదేశాల్లో ప్రమాదా లుండవా?" అని భర్త నడిగింది. "మన దగ్గర ఏమీ లేవుగదా. మనకు భయమెందు" కని కూరేశు లన్నారు. అండాళ్ వణికిపోతూ 'మీరు నీరు త్రాగడానికి అవసరమవుతుందని మీ బంగారు గిన్నె తెచ్చాను' అని రహస్యంగా చెప్పింది. కూరేశులకు కోపంవచ్చి 'అన్నీ ఇచ్చివేసి రమ్మని స్పష్టంగా చెప్పాను. ఏమిటి నువ్వు చేసింది. ఆ గిన్నె ఇలా ఇయ్యి' అని గట్టిగా అరిచి దాన్ని తీసుకుని దూరంగా పారవేశారు. తరువాత చిరునవ్వు నవ్వుతూ

'దాంతో నీ భయ మెగిరి పోతుంది' అన్నారు.

కూరేశులను సాదరంగా ఆహ్వానించేందుకు రామానుజులు తమ శిష్యులను నియోగించారు. ఆ తరువాత రామానుజుల శిష్యులలో కూరేశులే ముఖ్యులయ్యారు.

రామానుజుల కీర్తి ప్రతిష్ఠలు దూర దూరాలకు వ్యాపించ సాగాయి.

పూర్వం రామానుజులను పంపించి వేసిన అద్వైతాచార్యులు యాదవ ప్రకాశులకు ముసలితనం పైబడినకొద్దీ నైరాశ్యమావ రించింది. ఆయన వేదాంత మాయనకు కావలసిన మనశ్శాంతి నివ్వలేకపోయింది. తనకెవ్వరూ తోడు లేరనీ లోకమంతా తన్ను వెలివేసిందనీ భావించసాగారు. ఆయనను కన్న తల్లికూడా రామానుజుల ప్రభావంలో పడిపోయింది. ఆమె దృష్టిలో రామానుజులు సాక్షాత్తూ శ్రీ వరదరాజ స్వామి వారి అవతారమే.

ఆమె యాదవులను వెళ్ళి రామానుజుల నాశ్రయించమని హితోపదేశం చేసింది. కాని ఆయన పూర్వం రామానుజులపట్ల తాము చూపిన క్రౌర్యాన్ని తలుచుకుని ఎలా వెళ్లడమా అని తటపటాయించారు. ఒక రోజు ఆయన వీథుల వెంట తిరుగుతూ తిరుక్కచ్చి నంబిని చూడడం తటస్థించింది. యాదవులు తమ దురవస్థనంతటినీ ఆయనకు విన్నవించారు. తిరుక్కచ్చినంబి 'మీరు దయవుంచి రామానుజుల నాశ్రయించండి. మీ అశాంతి తొలగిపోతుంది' అని అన్నారు.

యాదవు లిది దైవాజ్ఞగా భావించి మరునాడే రామానుజ మఠానికి వెళ్ళారు. కాళ్లమీద పడబోతున్న యాదవులను రామానుజులు లేవనెత్తి ముకుళిత హస్తాలతో సాదరంగా ఆహ్వా వించారు. వారికొక ప్రత్యేకాసనం చూపి అత్యంత గౌరవంతో వారితో ప్రసంగించారు.

'మిమ్మల్ని ఇలా చూడగలిగినందుకు నాకానందంగా ఉన్నది.

నాకొక్క సందేహమున్నది. ఉన్నది సగుణ బ్రహ్మమే అని మీరెలా నిరూపిస్తారు' అని అడిగారు యాదవులు.

"కూరేశుడు నా ముఖ్యశిష్యుడు. అతనే మీకు సమాధానం చెప్పగలడని" రామానుజులన్నారు.

అప్పుడు కూరేశులు 'అయ్యా! బ్రహ్మము సగుణమే. ముండకోపనిషత్తులో బ్రహ్మము సర్వజ్ఞుడనీ, సర్వవిదుడనీ స్పష్టంగా ఉన్నది. శ్వేతాశ్వతరోపనిషత్తు ననుసరించి బ్రహ్మమున కనేక మహోన్నత గుణాలున్నాయని విదితమవుతుంది. జ్ఞాన బల క్రియాదులాయన సహజ గుణాలు!' అని సమాధానం చెప్పారు.

అంతటితో ఆగక ఒకటి తర్వాత ఒకటిగా అనేక శ్రుతి ప్రమాణాలను ప్రకరణ శ్లోకసంఖ్యలతో ఉదహరిస్తూ వివరించారు. చిట్టచివరకు యాదవులాయన సమాధానంతో తృప్తి పడ్డారు. రామానుజుల నాలింగనం చేసుకుని 'కుమారా! ఇది నిజం. నీవా రాఘవుని తమ్ముడు లక్ష్మణుడవే!' అని అభినందించారు.

యాదవులు పరివర్తన చెందడం ఆ రోజుల్లో బహుళప్రచారం పొందింది. రామానుజులు తమ మత ప్రచారాన్ని శ్రీరంగంనుండి సాగించాలని అక్కడి శ్రీవైష్ణవులందరూ వాంఛించారు. కంచినుండి రామానుజులను తెచ్చేందుకు పూర్వం పెరియనంబి వెళ్లినా ఆయన భార్యకు రామానుజుల భార్యతో వచ్చిన వివాదం వల్ల ఆయన ఊరికే తిరిగి రావలసివచ్చింది. ఇప్పుడు పరిస్థితి మారిపోయిందని శ్రీవైష్ణవుల కందరకూ తెలిసింది. కంచిలో మతాన్ని స్థాపించి విస్తృతంగా విఖ్యాతిపొందిన రామానుజులను అక్కడి వైష్ణవులు కదలనివ్వరు. అందుకని శ్రీరంగంలోని వైష్ణవులు ఒక పథకం వేశారు.

తిరువరంగ పెరుమాళ్ళరాయరు భగవదనుగ్రహ పాత్రులైన మహా గాయకులు. ఆయన ఆళవందారు ముఖ్య శిష్యులలో ఒకరు.

కంచికి వెళ్ళి రామానుజులను సమ్మోహితులను చేసి తీసుకు రమ్మని ఆయనను నియోగించారు.

పెరుమాళ్ళాయరు కంచి చేరుకుని సరాసరి ఆలయంలోకే వెళ్ళారు. అక్కడ రామానుజులతో సహా చాలామంది సమావేశమై ఉన్నారు. శ్రీరంగ మహా గాయకులు దివ్య ప్రబంధ స్తోత్రాలు కొన్నింటిని గానం చేయసాగారు. చుట్టు పక్కల జనమంతా తన్మయులై వింటున్నారు. కోవెల పూజారులలో ముఖ్య వ్యక్తిని వరదరాజస్వామి ఆవేశించి పెరుమాళ్ళాయరుతో 'అమోఘమైన మీ దివ్య గానానికి మీక్కావలసింది ఏమైనా సరే కోరుకోండి' అన్నారు. పెరుమాళ్ళాయరు కోరుకున్నారు. వారికి కావలసింది రామానుజులే. ఇది భగవదభీష్టంగా భావించి రామానుజులు శ్రీరంగం వెళ్ళడానికి కంచి వైష్ణవులు సమాధాన పడ్డారు.

రామానుజులకు శ్రీరంగంలో ప్రేమాదరాలతో స్వాగతం లభించింది. వేదమంత్ర పఠనంతో ఆహ్వానించి ఆయన ఆగమనాన్ని మహోత్సవంగా నిర్వహించారు. రామానుజులాలయానికి వెళ్ళి శ్రీరంగానాథస్వామిని సేవించుకున్నారు. తమిళ వేదంలో యోగనిద్రా ముద్రితుడైన స్వామి సౌందర్యాన్ని అభివర్ణించిన మనోహర పంక్తులన్నీ రామానుజుల స్మృతికి వచ్చాయి. ఆ క్షణంలో తనని ఆళవందారు పైనుండి ఆశీర్వదిస్తున్నట్లు తోచింది. పరమపదించిన గురుపాదుల తీరని కోరికలు తీర్చవలసిన బాధ్యత తనమీద ఉన్నది. పరిస్థితుల ప్రాబల్యం వల్ల తాము ఆళవందారుకు ఉత్తరాధికారి కావలసి వచ్చినందుకు ఆయనకు పరమానందమయింది. రామానుజులు మొట్ట మొదట ఆలయాన్నిగూర్చి శ్రద్ధ వహించారు. ఆలయంలో చాల గోడలు శిథిలావస్థలో ఉండగా వాటినన్నింటినీ బాగుచేయించారు. ఆలయంచుట్టూ అందమైన పుష్పవాటికలు నాటించారు. పూజా విధానంలో చక్కని కట్టుబాట్లు ఏర్పరచారు. వేద పఠనంతో దివ్య ప్రబంధ

గానానికి సమానమైన ప్రాముఖ్యం ఉండాలని నిర్ణయించారు. పురాణ కథలతో కూర్చిన ఒకానొక సంగీత రూపకం ద్వారా వైష్ణవ మతం సర్వ జనులకూ అందేటట్లు ప్రచారం చేశారు. పూర్వం మతమంటే పండిత ప్రకాండుల నీరస వివాదాలే అనుకుని విసుగెత్తిపోయిన జనానికి ప్రాణాలు లేచి వచ్చేటట్లు ఆలయంలో అనేక మహోత్సవాలు ఏర్పాటు చేశారు. అర్థాత్తూ వారు సర్వాత్మనా మత ప్రచారానికి ఉద్యుక్తులయ్యారు. ఆ కాలంలో వైష్ణవం శక్తిమంతమైన మహోద్యమంగా పరిణమించింది.

## VI

రామానుజులు పెరియనంబిని దర్శించి, కంచి విడిచి ఆయన హఠాత్తుగా వెళ్లిపోవడానికి కారణమైన తన ఇల్లాలి అనుచిత వర్తనకు, ఎంతో వినయంతో తమ విచారాన్ని ప్రకటించారు. పెరియనంబి తమకా సన్నివేశమే గుర్తు లేదంటూ గోష్ఠిపూర్ణ నామాంతరులైన తిరుకోష్టియూరు నంబి నాశ్రయించి ద్వయ మంత్ర మహార్థం గ్రహించమని రామానుజుల కాదేశించారు. ఆయన తిరుకోష్టియూరు వెళ్లి ఆ మహాత్ము లెక్కడుంటారని కనిపించిన బాటసారుల నడిగారు. ఆ మహానుభావులు నివసించే పూరి గుడిసె అదే అని రామానుజులకు వారి నివాసాన్ని చూపించారు ఆ బాటసారులు. రామానుజు లక్కడకు వెళ్లి గురువులకు పాదాభివందనం చేసి ద్వయ మంత్ర మహార్థం ఉపదేశించమని ప్రార్థించారు. గోష్ఠిపూర్ణులు రామానుజుల శ్రద్ధను పరీక్షించాలనుకుని ఆయన ఎంతసేపు కూర్చున్నా పెదవి విప్పనేలేదు. రామానుజులు నిరాశచెంది శ్రీరంగానికి తిరిగి వచ్చారు. రెండవసారి వెళ్లినా

అంతే అయింది. ఆ విధంగా రామానుజులు పద్దెనిమిది పర్యాయాలు వెళ్లడం తటస్థించింది గాని ప్రతిసారి శ్రీరంగానికి ఊరికే తిరిగి రావడమే ఫలితమయింది. చిట్టచివరకు రామానుజుల పట్టుదలా, శ్రద్ధా గోష్ఠిపూర్ణులకు నచ్చి ద్వయ మంత్రార్థాన్ని ఉపదేశం పొందడానికి దండధ్వజాలతో ఒంటరిగా మాత్రమే రావలసిందని తమ శిష్యుని ద్వారా ఆయనకు కబురంపించారు.

ఈరా రామానుజులు కూరేశులనూ, దాశరథినీ తమ వెంట బెట్టుకుని రావడం గోష్ఠిపూర్ణులు చూసి 'ఒంటరిగా రమ్మని చెప్పాను గదా! ఇదేమి' టని ఆశ్చర్యాన్ని ప్రకటించారు. రామానుజులు చిరునవ్వు నవ్వుతూ 'అవును స్వామీ! దండధ్వజా లతో రమ్మన్నారు. దాశరథి నా దండం, కూరేశులు ధ్వజ మున్నూ' అన్నారు.

ఈ సమాధానంతో గోష్ఠిపూర్ణుల హృదయం ఆర్ద్రమైంది. వారా ముగ్గురికీ ద్వయమంత్ర రహస్యార్థాన్ని వివరించసాగారు. ఈ రహస్యార్థాన్ని ఎన్నడూ ఎవ్వరికీ చెప్పగూడదనీ, అతి గోప్యంగా ఉంచవలెననీ వారిచేత ముందుగానే ప్రతిజ్ఞ చేయించి తరువాత చెప్పారు.

ఎనిమిది అక్షరములూ మూడు పదములూ ఉన్న 'ఓమ్ నమో నారాయణాయ' అనే ఆ మహా మంత్రానికి చెందిన ఏ రహస్యార్థం తెలిస్తే మోక్షం కరతలామలకమవుతుందో ఆ అర్థాన్ని రామానుజులు గ్రహించారు.

మోక్షం కొద్దిమంది ప్రత్యేక వ్యక్తులకు మాత్రమే పరిమితం కావడం భావ్యం కాదని రామానుజులకు అనిపించింది. ఇది వైష్ణవమత మహాశయానికే విరుద్ధమనిపించింది. గోష్ఠిపూర్ణుల ఉపదేశాన్ని అందరికీ బహిరంగం చెయ్యాలని ఆయన నిర్ణయించు కున్నారు.

మరునాటి ఉదయం ఆలయ గోపురాన్ని అధిరోహించి జనుల

నందరినీ సమావేశం కమ్మని ఆహ్వానించి నిరవధిక ప్రేమ వాత్సల్యాలతో గోష్ఠిపూర్ణుల ఉపదేశంద్వారా తాము గ్రహించిన విజ్ఞానాన్నంతటినీ ఏమాత్రమూ దాపరికం లేకుండా విస్పష్టం చేశారు.

ఈ వార్త వింటూనే గోష్ఠిపూర్ణులు రామానుజులను రప్పించి 'రహస్య గోపనానికి చేసిన శపథాన్ని అతిక్రమించావేమి' టని మందలించారు. రామానుజులు వినయంగానే 'నిజమే స్వామీ! అతిక్రమణ జరిగిం' దన్నారు. 'దీనికి ఫలితంగా నీవు నరకానికి వెళతావు తెలుసా?' అన్నారు గోష్ఠిపూర్ణులు. 'తెలుసును. ఇప్పుడింతమంది ముక్తులయ్యారు కాబట్టి నేనొక్కణ్ణీ నరకానికి వెళ్లినా నాకు చింతలేదు' అన్నారు రామానుజులు. గోష్ఠిపూర్ణు లీ సమాధానం విని నిర్ఘాంతపోయారు. తమ వైష్ణవ పరిజ్ఞానమంతా సిద్ధాంత దశలోనే ఉన్నది. కాని రామానుజులు ఆ తత్త్వాన్ని అనుష్ఠిస్తున్నారు. ఏ సిద్ధాంత బలమయినా సర్వ జనోపకారకంగా అనుష్ఠించడంలోనే నిరూపితమవుతుంది. ఆళవందారు ఉత్తరాధికారి గురువులకే గురువయ్యారు. ఈ సంగతిని గుర్తించిన గోష్ఠిపూర్ణులు రామానుజుల్ని ఆలింగనం చేసుకుని హృదయపూర్వకంగా ఆశీర్వదించి "ఎంబెరుమా" నని వారిని సంబోధించారు. ఆ మాటకు మా ప్రభువని అర్థం. అంటే పునరుజ్జీవిత వైష్ణవానికి నాయకుడన్న మాట. రామానుజులు గురుపాదులకు సాష్టాంగ నమస్కారం చేసి శ్రీరంగానికి వెళ్లారు.

నమ్మాళ్వారు రచించిన 'తిరువాయిమొళిని' మాలాధరులు ఆళవందారు ముఖతః అధ్యయనం చేశారు. ఆ మాలాధరుల నాశ్రయించమని గోష్ఠిపూర్ణులు రామానుజుల నాదేశించారు.

రామానుజులు మాలాధరుల వద్దకు పోయి తమకు తమిళ ప్రబంధాన్ని బోధించనుని ప్రార్థించారు. తాము సరాసరి ఆళవందారు నుండి గ్రహించిన దానికి తూచా తప్పకుండా మాలా

ధరులు ఆ ప్రబంధంలోని ప్రతి స్తోత్రాన్నీ రామానుజుల కుపదే శించారు. కాని రామానుజులకు అడుగడుగునా అనేక నూత నార్థాలు స్ఫురించాయి. వాటి నెప్పటికప్పు డాయన ప్రకటించగా మాలాధరులకు కష్టం తోచింది. "ఆళవందారు కంటే నీవే అధి కుడ వనుకుంటున్నట్లున్నావే?" అంటూ మాలాధరులు తమ ఉప దేశాన్ని విరమించారు. కొన్నాళ్లయిన తరువాత రామానుజులు మళ్లీ వారి దగ్గరకు పోయి ఒక గ్రంథం గొప్పదనం అది ఎప్పటి కప్పుడు అనేక నూతనార్థాలు ఇవ్వగలగడం వల్ల పెరుగుతుందే గాని తరగదనీ, నూతనార్థాలు చెప్పడం సాంప్రదాయికార్థాలను ఎదిరించడంగా భావించ నవసరం లేదనీ మనవిచేశారు. ఆళ్వారుల బోధనలను ఎంతో నిశితంగా రామానుజులవగాహన చేసు కున్నందుకు మాలాధరులు వారి నభినందించ గలిగారు.

ఇంతటితో రామానుజుల విద్యార్థి దశ ముగిసింది. ఆ తర్వాత వారు వేదాంత బోధన కుపక్రమించారు. అనేక భిన్న మత ప్రతిపాదకులు వారిచే ప్రభావితులయ్యారు.

ఈ సమయంలోనే ఉత్తరదేశంలో దిగ్విజయ యాత్ర ముగించు కుని యజ్ఞమూర్తి అనే అద్వైత వేదాంతి స్వదేశానికి తిరిగి రావటం జరిగింది. వారు దేశంలో వెళ్లిన చోటనల్లా ప్రశంసలు పొంది రామానుజుల ప్రశస్తి చెవిని బడగా వారితో వాదించడానికి శ్రీరంగం చేరుకున్నారు.

రంగనాథస్వామి ఆలయంలోనే విద్వత్సభ ఏర్పాటయింది. పద్దెనిమిది రోజుల పాటు తీవ్రంగా చర్చ సాగింది. రామానుజుల నిబ్బరం యజ్ఞమూర్తి కాశ్చర్య కారణమయింది. వారి తాత్త్విక దృక్పథమే వారికా స్థైర్యాన్ని ప్రసాదించిందని యజ్ఞమూర్తి నిశ్చయించుకున్నారు. చివరకాయన రామానుజులకు పాదా క్రాంతులై వారి శిష్యులయ్యారు. 'ఆయనే అరుళాల పెరుమాళ్ ఎంబెరుమానార్' అనే పేరుతో ప్రసిద్ధులయ్యారు.

# VII

రామానుజులు శ్రీరంగదేవాలయ సర్వాధిపత్యాన్ని పొంది వైష్ణ వోద్యమ వ్యాప్తికి దాన్ని కేంద్రంగా ఉపయోగించారు. ఆలయ నిర్వహణాధికారిగా అకలంగుడనే చోళ సామంతరాజును నియ మించారు. ఈ అకలంగుడు రామానుజుల శిష్యుడైన విధానానికి ఒక చిత్రమైన కథ ఉన్నది.

ఈ అకలంగుడు రాజ్యాధిపతిగా ఉండగా ఆయనకు ధను ర్దాసు అనే నామాంతరంగల ఉరంగవిల్లి అంగరక్షకుడుగా ఉండే వాడు. ధనుర్దాసు ఆజానుబాహువు. విశాల భుజ స్కంధాలతో నిండు విగ్రహం గలవాడు. ఆయన భార్య పొన్నాచి లోకోత్తర సౌందర్యవతి. ఆమె నమితంగా ప్రేమిస్తూ క్షణమైనా ఎడ బాటు సహించలేక పోయేవాడు ఉరంగవిల్లి.

వాళ్లొక మాటు చైత్రోత్సవ దర్శనానికై శ్రీరంగం వచ్చారు. ప్రేయసి పొన్నాచి వీథిలో నడుస్తూ ఉంటే ఆమెకు ఎండ తగుల కుండా ధనుర్దాసు గొడుగు పడుతున్నాడు. రామానుజులు తమ శిష్యులతో ఈ దృశ్యాన్ని చూశారు. శిష్యులలో ఒకనికి అతడంటే తీవ్రమైన అసహ్యం తోచింది. ధనుర్దాసు వట్టి కామాంధుడని ఆ శిష్యుని అభిప్రాయం. అతడు తన మనసులో ఉన్నది దాచుకో లేక 'సిగ్గుచేటు పని' అంటూ అసహ్యించుకున్నాడు. రామానుజు లతని వంక చూసి చిరునవ్వు నవ్వారు. 'నువ్వు పొరపాటు పడు తున్నావు. ఆ వ్యక్తి కామాంధుడు కాడు. నిజమైన ప్రేమికుడు. ఆ ప్రేమ ఎంత గొప్పదంటే ఎవరే మనుకున్నా లక్ష్యం చెయ్య నియ్యదు. అట్టి ప్రేమజీవి నిజంగా భగవదనుగ్రహానికి పాత్రు డవుతాడు. ఈ విద్యా విహీనుణ్ణి భార్యా ప్రేమనుండి భగవత్ప్రే మకు తిప్పడం ఏమంత కష్టం కాదు' అన్నారు.

రామానుజులు సరాసరి ధనర్దాసు దగ్గరకు వెళ్లి, "నీవు చేస్తున్నదేమిటి బాబూ?" అన్నారు. అతడు తన భార్య లోకోత్తర సౌందర్యవతి అనీ ఆ సౌందర్యాన్ని తాను ఆరాధిస్తున్నాననీ అన్నాడు. రామానుజు లతనితో సృష్టిలో ఇంతకంటే సుందరము లైనవీ, మానవ మాత్రులకంటె ఎన్నో రెట్లు శాశ్వతమైనవీ అనేక మున్నాయన్నారు. ఉరంగవిల్లి అటువంటి దొక్కటున్నా చూపండి చాలు అని సవాలు చేశాడు. రామానుజు లతన్ని ఆలయంలోకి తీసుకువెళ్లి తెల్లవారుతూనే విచ్చుకునే పద్మాలవలె జగన్మోహనా లైన రంగనాథస్వామి వారి నేత్రాలు చూపించారు. ఉరంగవిల్లి నోటమాట రాక తన్మయత్వంలో అలాగే నిలుచుండి పోయాడు. రామానుజుల శిష్యుడయి ఆలయంలోనుండి బయటికి వచ్చాడు.

ఈ సంగతి విన్న పొన్నాచి రామానుజుల నాశ్రయించి తనని గూడా శిష్యురాలిగా స్వీకరించమని ప్రాధేయ పడింది.

ఉరంగవిల్లి రామానుజుల శిష్యుడై తనకున్న సమస్తమూ మఠానికి సమర్పిస్తున్నాడని తెలిసి ఆ వ్యక్తిలో ఇంతటి మార్పు తెచ్చిన మహానుభావుల దర్శనం చేసుకోవాలని నాయకుడైన అకలంగుడు తహ తహ లాడాడు. ఆయన వెళ్లడం, రామానుజు లను చూడడం, వారి శిష్యుడై పోవడం వెంట వెంటనే జరిగాయి. ఆయన వైష్ణవులలో అగ్రేసరుడయ్యాడు. రామానుజులాయన పరిపాలనానుభవాన్ని ఆలయ నిర్వహణం సక్రమం చేయడానికి వినియోగించారు.

రామానుజుల ఉన్నతాశయాలకూ, ఆలయ పూజారుల సంకుచిత మనస్తత్వానికీ పొత్తు కుదరలేదు. రామానుజుల నియమపాలనం వీరికి నచ్చకపోగా ఆయన కంచినుండి అనవ సరంగా వచ్చి తమ విషయాల్లో జోక్యం కలిగించుకుంటున్న దురధికారిగా భావించారు. ఏ విషమో పెట్టి వారిని వదిలించు కోవాలని కూడా ప్రయత్నించారు.

అప్పుడు రామానుజులు సన్న్యాస నియమాను సారంగా ఏడుగురు గృహస్థుల ఇళ్లల్లో భిక్షం ఎత్తి లభించిన దానితో కాల క్షేపం చేసేవారు. ఈ పూజారులా గృహస్థులలో ఒకరి ఇంటికి వెళ్లి వారికి పెట్టే అన్నంలో విషం కలపవలసిందని కోరారు. వారికి లోబడిన గృహ యజమాని అలా చెయ్యమని భార్య నాదే శించాడు. అన్యాయమని ఆమె పెట్టిన మొర అరణ్య రోదనమే అయింది. ఆమె భర్త చెప్పినట్లు చేయక తప్పలేదు. రామానుజులు వచ్చినప్పుడు ఆమె తనను తాను నిగ్రహించుకోలేక కన్నీళ్లు కారుస్తూనే విషాహారం పెట్టింది. ఆమె చేతులు వణికిపోయాయి. ఎక్కడో దోషమున్నదని రామానుజులకనుమానం తోచి ఆ ఆహారాన్ని స్వీకరించలేదు. పట్టుకుపోయి నదిలో పారవేసి ఊరుకున్నారు.

శిష్యులకీ విషయం తెలిసి అందరూ ఆందోళన చెందారు. రామానుజులు భిక్షాటనం మానివేయాలని బ్రతిమాలారు.

కాని రామానుజులకు బ్రాహ్మణుడు వినయ సౌశీల్యవంతుడు కావడానికి భిక్షాటనమొక మార్గమని గట్టి నమ్మక మున్నది. కొంగుదేశం నుండి ఒక స్త్రీ వచ్చి మీరు దాసానుదాసులై మహా రాజులుండగా ఈ యాచనా వృత్తి ఎందుకని అడిగినప్పుడు వారు తమ నమ్మకాన్ని విస్పష్టం చేశారు.

అంతే కాదు. ఒకప్పుడు రామానుజులు పెరియనంబి ఇంటికి భిక్షాటనకి వెళ్లి తలుపు వద్ద నిలబడి ఆండాళ్ తిరుప్పావై తన్మయత్వంతో గానం చేస్తున్నారు. ఆ పాటలో ఒకానొక కన్య తనని లోపలికి రానిస్తూ భగవదాలయ ద్వారాలు తెరవమని శ్రీ కృష్ణుని ప్రియురాలైన నప్పినను జాలిగా వేడుకుంటున్నట్లు వర్ణన వుంది. ఆ పంక్తులను రామానుజులు గానం చేస్తూ ఉండగా పెరియనంబి కుమార్తె అత్తులై వచ్చి తలుపులు తెరిచింది. రామానుజుల దృష్టికి కనిపించింది నప్పిన గాని అత్తులై కాదు.

ఆయన పారవశ్యంతో సాష్టాంగ పడ్డారు. అత్తులై కంగారుపడి భయపడుతూ లోపలికి పారిపోయి తండ్రితో జరిగినదంతా చెప్పింది. పెరియనంబి వెలుపలికి వచ్చి నిమీలిత నేత్రాలతో రామానుజులు గానం చేస్తూ ఉండడం చూచారు. వారి పార వశ్యానికి కారణమేమిటో ఆయన కవగతమైంది.

మరొక సందర్భంలో భిక్ష మెత్తుతూ రామానుజులు వీథి వెంట వెళుతున్నారు. దారిలో కొందరు పిల్లలు ఆలయంలో పెద్దలు చేసే పనుల ననుకరిస్తూ ఆడుకుంటున్నారు. ఏవో కొన్ని గీతలు గీసి అది ఆలయమంటూ పూజలు చేస్తున్నారు. మట్టి పోగుచేసి దాన్నే ప్రసాదంగా పంచిపెడుతున్నారు. పెద్దవాళ్లు వాళ్ళ చేష్టలకు నవ్వుకుంటూ ఆ మట్టి పారవేస్తున్నారు. కాని రామానుజులా పిల్లల దగ్గరకు వెళ్లి వాళ్ల భావనలో ఆలయమైన ప్రదేశానికి అభి ముఖంగా సాష్టాంగపడి వారిచ్చిన మట్టిని ప్రసాదంగా భక్తి తాత్పర్యాలతో స్వీకరించారు. 'పసి పిల్లలు గూడా వారి ధోరణిలో వారు భగవద్భావన చెయ్యగలరు. తమ కల్పనాను సారంగా భగవన్మూర్తి నారాధించగలరు' అన్నారు రామానుజులు. 'వారి ఆలయం నిజంగా భగవంతుడు నివసించే చోటే, వారక్కడ దేవుణ్ణి చూస్తున్నారు గనుక' అని కంఠోక్తిగా చెప్పారు. భిక్షుక వృత్తి ఆయనలో తెచ్చిన వినయం అంత మహోదారమైనది.

## VIII

ఆధ్యాత్మికంగా అభ్యుదయాన్ని సాధించిన వ్యక్తులలో కులప్రస్తావన కవకాశమే లేదని రామానుజుల నమ్మకం. ఈ విషయాన్ని గూర్చి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి.

ఉరంగవిల్లి జన్మ చేత బ్రాహ్మణుడు కాడు. అయినా రామా

నుజులు ఆయనను అందరు శిష్యులకంటే, ఎక్కువగా అభిమానిం చారు. నదీ స్నానం చేసి వచ్చేటప్పుడు విల్లి బుజాల మీద చేయి ఆనించి నడిచివస్తూ వుండేవారు. బ్రాహ్మణ శిష్యుల కిది గిట్టేది కాదు. ఒక శిష్యుడు ఒకనాడు ఈ విచిత్ర ప్రవర్తనకు కారణమే మిటని అడగడానికి కూడా సాహసించాడు. రామానుజు లప్పు డేమీ సమాధానం చెప్పలేదు గాని వారి ప్రవర్తనను సమర్థించే సన్నివేశాన్ని త్వరలోనే కల్పించారు.

విశ్వాసపాత్రుడైన శిష్యుడొకణ్ణి రహస్యంగా పిలిచి మఠంలో వాళ్లు ఆరవేసుకున్న బట్టలలో కొన్నిటిని చించివేయమని ఆజ్ఞాపిం చారు. మరునాటి ఉదయం జరిగిన దానిని చూసి వాళ్లందరికీ కోపాలు వచ్చి తాము గడుపుతున్న జీవితాలకు ఎంతమాత్రమూ తగని దుర్భాషలతో నానా గోలా చేశారు. అంతా వినీకూడా రామానుజు లేమీ వ్యాఖ్యానించకుండా ఊరుకున్నారు.

తరువాత కొన్నాళ్లకు మరి యిద్దరు శిష్యులను పిలిచి విల్లి కుటీరంలోకి రాత్రివేళ పోయి అతని భార్య పొన్నాచి నగలన్నీ హరించుకుని రండని ఆజ్ఞాపించారు. వాళ్లలా అపహరిస్తూ ఉండగా మెలకువ వచ్చిన పొన్నాచి ఆ సంగతి తెలిసీ కూడా వారు అన్ని నగలూ తీసుకుపోవడానికి వీలుగా పక్కకు ఒత్తిగిల్లింది. ఆమె మేలుకున్నదని భయపడి దక్కిన వాటితోనే పారిపోయారు శిష్యులు. రామానుజులు వాళ్లను పిలిచి 'మీరిప్పుడు మళ్లీవెళ్లి ఆ భార్యా భర్తలకు జరిగే సంభాషణ చాటుగా వినిరండని' ఆదే శించారు. వాళ్లు మళ్ళీ వెళ్లి తలుపు చాటున నిలబడగా ఉరంగవిల్లి భార్యను నగలు పోయినందుకు గాక కొన్ని ఆమె శరీరం మీద మిగిలిపోయి నందుకు మందలిస్తున్న మాటలు వినిపించాయి. అతనంటున్నాడు గదా 'ఇప్పటికీ నీకు నగలంటే భ్రాంతి పోలేదు. అవి నీ వనుకుంటున్నావు. అందుకే పాప మా దొంగలకు అన్ని నగలూ దక్కక పోయాయి. ఒకరి కిచ్చేటప్పుడు నా సొమ్మన్న

స్మృతి లేకుండానే ఇచ్చివేయాలి.' శిష్యులీ మాటలు విని అతని ఔదార్యానికీ, నిర్లిప్తతకూ చకితులై రామానుజులతో జరిగినదంతా చెప్పారు.

మరునాడు రామానుజులు శిష్యులందరినీ సమావేశపరిచి గత రాత్రి తమకి జరిగిన అనుభవాన్ని అందరికీ చెప్పమని శిష్యులిరువురినీ ఆదేశించారు. వారి కథ ముగిసిన తరువాత గురువులు చిరునవ్వు నవ్వారు. కొంతసేపాగి రామానుజులు 'పట్టి గుడ్డముక్క నెవరో చింపుకు పోయినందుకు మీలో చాలామంది కోపంతో మండిపడి నానా దుర్భాషలూ ఆడారు. కాని ఉరంగవిల్లి నిజమైన వైష్ణవు డనిపించుకున్నాడు. అతనెంత నిర్లిప్తుడో చూడండి. బ్రాహ్మణ జన్మ ఎత్తినవాడు అట్టి వినయాన్ని కృషిచేసి సాధించుకోవాలి. ఆ లక్షణ మతనికి పుట్టుకతోనే వచ్చింది. మనం స్నానాలు చేసి వచ్చేటప్పుడు నే నతని భుజంమీదనే ఎందుకు చేయి వేస్తున్నానో అర్థమయిందా?' అన్నారు.

రామానుజుల శిష్యులలో కూరేశు లొక్కరే ఉరంగవిల్లి గొప్పతనాన్ని ప్రథమ సమావేశంలోనే గ్రహించగలిగారు. విల్లి నాయన 'మహామతీ' యని పిలిచేవారు. చదువుతోనూ సాధనతోనూ నిమిత్తం లేకుండా కేవల భగవదనుగ్రహంతో సహజంగానే ఆయన కా విజ్ఞాన వివేకాలబ్బాయని కూరేశుల అభిప్రాయం.

మారనేర్నంబి జన్మచేత అస్పృశ్యుడు. ఆయన ఆళవందారు శిష్యుడూ, పెరియనంబికి ప్రాణ స్నేహితుడూ. ఆయన ఒకప్పుడు దీర్ఘవ్యాధి పీడితుడై ఊరి వెలుపల గుడిసెలో ఉండేవాడు. పెరియనంబి రోజూ ఆయనకు అన్నం తీసుకువెళ్ళేవారు.

మారనేర్నంబిని గూర్చి రామానుజుల కప్పటికేమీ తెలియదు. కాని పెరియనంబి ఎక్కడికో అన్నం తీసుకు వెళుతూ ఉండడం గమనించారు. ఎవరికి తీసుకు వెళుతున్నదీ కనుక్కోవాలని ఒక రోజున ఆయనకు తెలియకుండానే అనుసరించారు. అక్కడ జబ్బుతో

పడివున్న అస్పృశ్యునకు పెరియనంబి ఎంతో ఆదరంతో అన్నం కలిపి పెట్టడం చూసి రామానుజుల హృదయం ద్రవించిపోయింది. తరువాత కొన్నాళ్ళకు ఆచారపరులైన బ్రాహ్మణులు పెరియనంబి చేస్తున్న పనిని ఖండించి, ఆయన ఇంటిని చుట్టు ముట్టినప్పుడు రామానుజులాయన పక్షాన నిలిచి వారి నాదుకున్నారు.

పెరియనంబి కుమార్తె అత్తులైని రామానుజులు తమ సోదరిగా భావించారు. ఆమెకొక సామాన్య బ్రాహ్మణ యువకునితో వివాహ మయింది. ఆ యువకుని తల్లిదండ్రులు అత్యాశాపరులు. ఆ రోజుల్లో దాసదాసీలను వెంట పంపడం వరకట్నంలో భాగంగా ఉండేది. పెరియనంబి అంత ధనవంతులు కానందువల్ల తమ కుమార్తె వెంట ఎవరినీ పంపలేక పోయారు. ఇందుకోసం అత్తగారు అత్తులైని సాధిస్తూ ఉండేది. అత్తులై పుట్టింటికి వచ్చి తండ్రితో చెప్పుకుని ఏడ్చింది. ఎవరినో ఒకరిని పంపే ఏర్పాటు చేయకపోతే అత్తగారు తనని వేపుకు తినడం మానదని గోలపెట్టింది. అంతా విని పెరియనంబి రామానుజులతో సంప్రతించ మన్నారు. గురువు ఈ సంగతి వింటూనే తమ శిష్యుడు ముదలియాండనను అత్తులై అత్తవారింటికి వెళ్ళమని ఆదేశించారు. అత్తులై అత్తగారు ఆ మహాను భావుడు తమ కుటుంబానికి సేవ చేయడానికి రావడం చూసి నిర్ఘాంతపోయింది. ఆయన సరాసరి ఇంట్లోకి పోయి బట్టలుతకడం ప్రారంభించారు. పాపమా అత్తగారు రామానుజ మఠానికి వెళ్లి 'మీ శిష్యుణ్ణి మీరు వెనక్కు పిలవండని' ప్రార్థించింది. రామాను జుల కాళ్లమీదపడి తన ప్రవర్తనకు మనస్ఫూర్తిగా పశ్చాత్తాపాన్ని ప్రకటించింది. రామానుజులు ముదలియాండనను రప్పించి వేశారు.

రామానుజుల శిష్యులందరూ వైష్ణవ బోధనలను జీవితంలో సక్రమంగా ఆచరించేవారు. గురువు ఆజ్ఞ ననుసరించి ఒకరి ఇంటిలో బట్టలుతకడం తన మర్యాదకు భంగకరమని ముదలి యాండను భావించనే లేదు.

భగవద్గీతోపన్యాసం చెయ్యడంలో చూపే శ్రద్ధా ఉత్సాహాలనే ఈ బట్టలుతకడంలోనూ చూపారాయన. నిజానికి రామానుజ మతంలో పాండిత్యం, కులం, హోదా మొదలైన వాటితో నిమిత్తం లేకుండా అందరూ అన్ని పనులూ చేసేవారు. కిడంబియాక్కాన్ పాకగృహ పర్యవేక్షకుడుగా ఉండేవాడు. ఉరంగవిల్లి కోశరక్షణ చేసేవారు. రామానుజుల దైనిక కార్య క్రమ నిర్ణయం ముదలియాండను అధీనంలో ఉండేవి. మత సిద్ధాంతాలను తెలుసుకోవడంలోనే కాక వాటిని శ్రద్ధా తాత్పర్యాలతో ఆచరించడంలో వారందరూ సుశిక్షితులయ్యారు.

# IX

రామానుజులు తమ మేనమామ యైన తిరుమలై నంబి సాహచర్యంలో రామాయణాధ్యయనం చేయడానికి తిరుపతి కొండలకు వెళ్లాలని నిశ్చయించుకున్నారు. ఆ నిశ్చయాని కనుగుణంగా తమ ముఖ్య శిష్యులను వెంటబెట్టుకుని యాత్రకు బయలుదేరారు.

దారిలో వారు అష్ట సహస్ర గ్రామాన్ని చేరుకున్నారు. అక్కడ వారి ముఖ్య శిష్యులు వరదరాయ, యజ్ఞేశులని ఇద్దరున్నారు. వారిలో యజ్ఞేశులు ధనవంతులు, వరదరాయలు బీదవాడు.

రామానుజులు ఊళ్లో అడుగు పెడుతూనే వరదరాయల పూరి గుడిసెకు వెళ్లారు. అప్పుడా శిష్యుడు భిక్షాటనకు వెళ్లి ఉన్నాడు అంతటి మహానుభావులు తమ ఇంటికి వచ్చినందుకు అతని భార్య పరమానంద భరితురాలయింది. కాని పాపమామె చాలీచాలని గుడ్డలతో ఉన్నందువల్ల బయటకి రాలేకపోయింది. రామానుజులామె పరిస్థితిని గ్రహించి తాము తలకు చుట్టుకునే రంగు గుడ్డను లోపలికి విసిరివేశారు. అప్పుడా గుడ్డ కట్టుకుని ఆమె ముకుళిత

హస్తాలతో వెలుపలకి వచ్చి గురువులకు పాదాభివందనం చేసి వినయ పూర్వకంగా స్వాగత వచనాలు పలికింది.

రామానుజులా గుడిసెలోకి వెళ్లారు. ఇంట్లో ఒక్క బియ్యపు గింజయినా లేదు. ఆమె ఒక్క నిమిషం ఆలోచించి వెంటనే ఏమి చేయాలో నిశ్చయించుకున్నది. చాలకాలం నుంచీ తనమీద కన్నువేసిన ధనిక వర్తకు డొకడు ఊళ్లో ఉన్నాడు. ఏదో నెపంతో రామానుజుల అనుజ్ఞ పొంది కావలసిన సరుకులు తేవ డానికి ఆ వర్తకుని కొట్టుకు వెళ్లింది. వాటి కెట్టి మూల్యాన్ని ఇవ్వ వలసి వస్తుందో ఆమెకు తెలుసు. ఆమె రావడానికే మురిసి పోయిన వర్తకుడు కావలసిన సరుకులన్నీ అరువుగా ఇచ్చాడు.

ఆతిథ్యమయి రామానుజులు వెళ్లిన తరువాత వరదరాయలు ఇంటికి వచ్చారు. ఆమె జరిగినదంతా భర్తతో చెప్పింది. మన మిద్దరమూ వర్తకుని దగ్గరకు వెళ్లి లెక్కలు తేల్చి వేసుకోవాలని భర్త అన్నాడు. వర్తకు డామెతో భర్తకూడా రావడం గమనించి నిశ్చేష్టుడయ్యాడు. వరదరాయలు 'నీకు కావలెనంటే నా భార్య శరీరాన్ని స్వయంగా నీకప్పగించడానికి వచ్చాను. మేమిద్దరమూ ఒకరినొకరం పూర్తిగా ఎరుగుదుము. ఆమె హృదయం నాది' అన్నారు. వర్తకుడు తేరుకొని వరదరాయల కాళ్లమీద పడి 'స్వామీ! మీకిచ్చిన సరుకులకు నేను మూల్యం తీసుకోను. మీ దయవల్ల నా కళ్లు తెరుచుకున్నాయి. అదే తగినంత మూల్యం' అని పశ్చాత్తాప పడ్డాడు.

ఈ వృత్తాంతం తెలిసిన రామానుజులు ఆ వర్తకునకు కబురు చేసి అతన్ని తమ శిష్యునిగా స్వీకరించారు. ఎట్టివారైనా బాగు పడవచ్చునని మరొకమారు రుజువయింది.

రామానుజులు యజ్ఞేశునకు గర్వాన్ని పరిత్యజించమనీ స్వార్థ రహిత త్యాగ బుద్ధితో భక్తుల బట్టలుతకమనీ సలహా యిచ్చారు. ఆ సేవ చేసినందువల్ల ఆయన ఎంతో వినయవంతులయ్యారు.

తరువాత గురువులు తిరుపతి కొండలు చేరుకున్నారు. కాళ్లతో ఆ పవిత్ర పర్వతాలను తొక్కే అపచారం చెయ్యలేక ఆయన నాలుగు కాళ్ల జంతువువలె చేతులూ మోకాళ్ళూ ఆన్చే ఏడు కొండలూ ఎక్కారని చెప్పుకుంటారు. పైకి చేరాక తమ ప్రియ శిష్యుడు అనంతసూరినీ, అతడెంతో శ్రద్ధగా పెంచిన పుష్పవాటినీ చూసి చాల సంతోషించారు. విశ్వాస పాత్రుడైన ఆ శిష్యుణ్ణి ప్రేమతో కౌగిలించి 'కుమారా! పూర్వం నీకోసం వహించిన శ్రద్ధ ఫలితాన్ని దేవపూజకైన ఈ పూలతో పొందుతున్నాను' అన్నారు.

తోట అంతా పూల సువాసనలతోనూ, ఫలవృక్షాల కమ్మదనంతోనూ నిండిఉన్నది. తుమ్మెదలూ పక్షులూ మనోహరంగా గానం చేస్తున్నాయి. ప్రశాంతమైన సరోవరాల్లో పద్మాలూ కలువలూ నిండిఉన్నాయి. వాఙ్మయ కవిత్వాన్ని ఆరాధించినట్లుగానే ప్రకృతి కవిత్వాన్ని ఆరాధించే రామానుజుల హృదయం పారవశ్యాన్ని పొందింది. ఆయన నిమీలిత నేత్రాలతో భగవద్ధ్యాన నిమగ్నులయ్యారు.

విశిష్టాద్వైత దృక్పథంతో రామాయణాధ్యయనం చేస్తూ రామానుజులు తమ మేనమామ తిరుమలై నంబితో అక్కడ ఒక సంవత్సరంపాటు గడిపారు. ఒక రోజు ఆయన మేనమామ గారి పూల తోట నుండి ఇంటికి వస్తూ ఎవరో ఒకాయన పాము నోట్లో వేళ్ల పెడూతూ ఉండడం చూశారు. రామానుజులాశ్చర్యంతో దగ్గరకు వెళ్లి ఆ వ్యక్తి తమ సోదరుడు గోవిందుడే అని గుర్తించారు. ఆయన రామానుజులడగకుండానే 'పాప మీ పాము నోట్లో ముల్లు గుచ్చుకుని చాలా సేపటినుంచీ ఇలా తెరుచుకునే ఉన్నది. నేనా ముల్లు తీస్తున్నాను' అన్నారు. గోవిందు ఆ పని పూర్తిచేశాక రామానుజులాయన్ని కౌగిలించుకుని 'నీవు నిజమైన వైష్ణవుడివి. ఎవరు బాధపడుతున్నా దాన్ని తొలగించడమే వైష్ణవ ధర్మం' అని అభినందించారు.

తిరుపతి నుండి శ్రీరంగానికి తిరిగివస్తూ గోవిందులను కూడా తమ వెంట తీసుకువచ్చారు రామానుజులు. కుమారుణ్ణి చూడ గలిగినందుకు గోవిందుని తల్లి ఎంతో ఆనందించింది. అయినా ఆమె సంపూర్ణానందం పొందలేక పోయింది. కుమారుడు భార్యతో కాపురం చెయ్యక ఒంటరిగా ఆధ్యాత్మిక సాధనలతో కాలక్షేపం చేస్తున్నాడని ఆమె దిగులుపడ్డారు. భార్యతో వుండ మని చెప్పమని ఆమె రామానుజులను కోరినది. కనీసం ఒక్క రాత్రి అయినా భార్యతో గడపమని రామానుజులు గోవిందునకు హితబోధ చేశారు. ఇది నిజానికి గోవిందుని నిగ్రహానికీ, విశ్వాసానికీ ప్రబల పరీక్ష. గోవిందు డంగీకరించాడు. భార్యా భర్త లిరువురూ భగవత్ప్రసంగంతోనే రాత్రంతా గడిపివేశారు. మరునాటి ఉదయం గోవిందుడు తన భార్యతో రాత్రి అంతా గడిపిన విధం తెలుసుకుని సన్న్యాసాశ్రమ స్వీకారానికి అతడన్ని విధాలా అర్హుడని రామానుజులు ప్రకటించారు.

గోవిందులు సిద్ధాంత విషయాల్లో గొప్ప పాండిత్యం కలవారు. వారు ఎంబరన్న పేరుతో జగత్ప్రసిద్ధి నందారు.

శ్రీ వేంకటేశ్వర స్వామికి దివ్య శంఖ చక్రాల నమర్పినది రామానుజులే అన్న ప్రతీతి సాంప్రదాయికంగా వస్తోంది. అయితే ఆ సన్నివేశాన్ని వేరు వేరు విధాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. మొదట్లో తిరుపతి శైవ క్షేత్రమే అనీ దాన్ని విష్ణు క్షేత్రంగా రామానుజులు మార్చి వేశారనీ కొందరు చెబుతారు. తాత్కాలి కంగా కనిపించక పోయిన దివ్య శంఖ చక్రాలను రామానుజులు పునః ప్రతిష్ఠించారే కాని ఆయన మార్చిన దేమీ లేదని ఇతరులీ వాదాన్ని తీవ్రంగా ఖండించారు.

ఈ కాలంలోనే రామానుజులు బ్రహ్మసూత్ర భాష్య రచన కుప క్రమించాలని నిశ్చయించుకున్నారు. తమ నిర్విరామ కృషి చేత దేశమంతటా మత విషయకంగా ప్రశాంత వాతావరణాన్ని

సాధించారు. వారి కీర్తి సుదూర ప్రాంతాల వరకూ దశ దిశలా వ్యాపించింది. ఆళవందారు మరణ శయ్యపై నుండగా తాము పట్టిన మూడు శపథాలనూ నెరవేర్చడానికి ప్రస్తుతం పూర్తి సంసిద్ధులమని భావించారు. కాని దాని కొక్కటే కొరత ఉండి పోయింది.

శ్రీ శంకరులు తమ భాష్యంలో బహుధా ప్రశంసించిన బోధాయన వృత్తిని గూర్చి రామానుజులు విని ఉన్నారే గాని చూడడం పడలేదు. దాని ప్రతి కాశ్మీరంలో మాత్రమే లభిస్తుందని తెలిసింది. ఆ పుస్తకం చదవాలని, రామానుజులు కూరేశులనూ మరికొందరు శిష్యులనూ తీసుకుని కాశ్మీరానికి వెళ్లారు. అక్కడి పండితులు తమ వ్రాత ప్రతులను రామానుజులకు చూపడానికి కూడా ఇష్ట పడలేదు. రామానుజులప్పుడు రాజ దర్శనం చేసి తమ వ్యక్తిత్వ, పాండిత్యాల చేత ఆయన ప్రశంసకు పాత్రులయ్యారు. అంతట కాశ్మీరు మహారాజు ఆ వ్రాత ప్రతులను రామానుజులకు చూప వలసిందని పండితులకు చెప్పారు. తరువాత వాటిని శ్రీరంగానికి తీసుకు వెళ్లడానికి కూడా అనుమతించారు. రామానుజులు తిరిగి వస్తూ ఉండగా వారి ననుసరించిన పండితులు ఆ ప్రతుల నపహరించారు. అప్పుడు రామానుజు లెంతో దిగులుపడ్డారు కాని కూరేశులు పుస్తకాలు పోయినందుకు దిగులు పడవలసిన అవసరం లేదనీ వాటిని తాను మొదటిసారి చూస్తూనే కంఠస్థం చేశాననీ చెప్పి రామానుజులనోదార్చారు.

ఆ విధంగా బ్రహ్మసూత్ర భాష్య రచనకు అవసరమైన పూర్వరంగమంతా సిద్ధమయింది. రామానుజులు శ్రీరంగం చేరుకుంటూనే ఆ రచన కుపక్రమించారు.

# X

బ్రహ్మసూత్ర భాష్య రచనలో రామానుజులకు కూరేశుల అఖండ మైన జ్ఞాపకశక్తి ఎంతగానో తోడ్పడింది. గురువులు చెపుతూ ఉంటే కూరేశులు కూర్చుని వ్రాస్తూ ఉండేవారు. కాని ఆ వ్రాయడం కేవలం యాంత్రికంగా జరిగేదికాదు. ఆయనకు సమన్వయం కుదరనప్పుడల్లా వ్రాయడం మానివేసేవారు. ఒక సారి రామానుజులు ఏమి వ్రాయడం లేదేమని కూరేశుల నడిగారు. కూరేశులు ఇది విశిష్టాద్వైత సిద్ధాంతానికే విరుద్ధంగా ఉన్నట్లు తోస్తోంది అన్నారు. గురువులు కాస్సేపు ఆగి కూరేశుల భావంతో ఏకీభవించారు.

కూరేశుల భార్య ఆండాళ్ కూడా గొప్ప పండితురాలు. సిద్ధాంత చర్చలలో ఆమె కూడా పాల్గొనాలని కుతూహల పడుతూ ఉండేది. రామానుజు లామె విస్తృత పరిజ్ఞానాన్ని గౌరవించి ఆమె భావాలకు సముచితమైన విలువ నిచ్చేవారు.

రామానుజుల భాష్యం శ్రీ భాష్య మన్న పేరు పొందింది. ఈశ్వరుడు సాకారుడనీ, ఆయన విశిష్టుడనీ, ఆయన ఒక్కడే సర్వమునకూ మూలమనీ ప్రతిపాదించే విశిష్టాద్వైత మతాన్ని, తత్సిద్ధాంతాన్ని శ్రీ భాష్యం సమగ్రంగా వివరిస్తుంది.

శ్రీ భాష్య రచనానంతరం రామానుజుల ఖ్యాతి మరింత విస్తృతమయింది. ఆళవందారు వాంఛలలో ఒకదాన్ని బహు సమర్థంగా తీర్చడమే కాక దాంతో తమ మతానికి విరుద్ధంగా వాదించే వేదాంత దృక్పథాల నన్నింటినీ పటిష్ఠంగా ఖండించి నందుకు దక్షిణ దేశంలోని శ్రీ వైష్ణవులందరూ రామానుజుల నమితంగా గౌరవించేవారు. ఈ విధంగా శ్రీ భాష్య రచన

శ్రీ రామానుజుల జీవితంలోనే కాక వైష్ణవ మత చరిత్రలోనే ప్రముఖ ఘట్టం అయింది.

ఆళ్వారులు పూర్వం దర్శించిన, తమ పాటల్లో ప్రస్తుతించిన పుణ్య క్షేత్రాల నన్నింటినీ సేవించుకోవాలని రామానుజులు తీర్థ యాత్రకు బయలుదేరారు. వారు వెళ్ళిన చోటల్లా ఆలయ నిర్వహణంలోనూ పూజా విధానంలోనూ సముచిత సంస్కరణలు చేశారు. మతం అతి సామాన్య మానవునకు కూడా అంద బాటులో ఉండాలన్నదే వారి పరమాదర్శం.

రామానుజుల యాత్రా మండలి పాండ్య దేశంలో తిరుమంగై ఆళ్వారు జన్మస్థానమైన తిరుపులింగుడి గ్రామం చేరినప్పుడు ఒకానొక అస్పృశ్య స్త్రీ ఎదురు వస్తే శ్రీ వారి శిష్యులలో ఒకరు ఆమెను ప్రక్కకు తొలగమన్నాడు. ఆమె చటుక్కున నిలబడి విశ్వమంతా భగవన్నివాసమే అయినప్పుడు ఏ ప్రక్కకు తొలిగితే మైల పోతుందో చెప్పమని అడిగింది. రామానుజులు వెనక్కు తిరిగి తమ శిష్యునితో 'చూశావా ? ఈమె నీకు వైష్ణ వంలో ముఖ్యాంశాన్ని బోధించింది' అన్నారు.

రామానుజులు తిరుకురుంగుడి, తిరుమల్లిరుంశోలయి, తిరుపుల్లని, ఆళ్వారు తిరునగరి, తిరుకురుంకుడి క్షేత్రాలను దర్శించారు.

తిరుకురుంకుడిలో ఒక చిత్రమైన సంఘటన జరిగినట్లు ప్రచారంలో ఉన్నది. అక్కడ రామానుజులకు భగవంతుడే శ్రీ వైష్ణవుని రూపంలో కనిపించి 'భగవంతు డవతార మెత్తి సాధించ లేకపోయిన మానవ సంస్కారాన్ని నీ వెలా చేయగల నను కుంటున్నావు? ఇంతవరకూ నీవు సాధించిన విజయానికి మూల మైన ఆ మంత్రమేదో నాకు చెప్పు' అని అడిగారట. రామానుజు లాయనకు ద్వయమంత్ర రహస్యార్థాన్ని బోధించి మానవజాతి కల్మషాల కన్నింటికీ విశ్వాసంకంటె మంచి మందు లేదని

చెప్పారుట. అప్పుడు స్వామి రామానుజుల నాశీర్వదించి అంతర్ధాన మయ్యారని ప్రతీతి.

తిరువన్ పరిసరంలో రామానుజులు అనేక భిన్న మత ప్రచార పండితులను ఎదుర్కోవలసి వచ్చింది. బ్రహ్మసూత్రాలకు రామానుజులు వ్రాసిన భాష్యాన్ని వారంగీకరించక సమర్థించుకోమని సవాలు చేశారు. అక్కడ జరిగిన వివాదాలన్నిటిలోనూ రామానుజులే గెలిచారు. సరస్వతీదేవి వారిని స్వయంగా ఆశీర్వదించడమే కాక ఇకమీద రామానుజులు శ్రీ భాష్యకారులనే ప్రశస్తి పొందుతారని ఆశీర్వదించినట్లు చెప్పుకుంటారు.

దక్షిణదేశ మూలలవరకు విజయవంతంగా యాత్ర ముగించుకుని రామానుజులు శ్రీరంగానికి తిరిగి వచ్చారు. అప్పటికి వైష్ణవం సుప్రతిష్ఠిత మతాల్లో ఒకటయింది. రామానుజులే దానికి ఏకైక నాయకులయ్యారు.

ఆ రోజుల్లో పాలకుడైన చోళరాజు రామానుజులనూ, ఆయన అనుచరులనూ అమర్యాద చేసినట్లు చరిత్ర చెబుతోంది. రామానుజులు క్రీ.శ. 1017 నుండి 1137 వరకు జీవించారు. వారి జీవిత కాలంలో చోళ దేశాన్ని ప్రథమ రాజేంద్రుని నుండి విక్రముని వరకు అయిదుగురు రాజులు పాలించారు. అప్పుడు చోళులు మహోన్నత దశ ననుభవిస్తున్నారు. రాజరాజు విస్తృత సామ్రాజ్యాన్ని సాధించాడు. అతని అనుయాయులు, ఆళ్వారులూ నాయన్మారులూ భక్తి గేయాలతో దాన్ని సంరక్షించుకుంటూ వచ్చారు. అఖండ మత సంబంధమైన పునరుద్ధరణ ఉద్భవించింది. ఆనాటి సాంస్కృతిక, మతైక శక్తుల ఫలితంగా మహోన్నత ఆలయాలు నిర్మింపబడ్డాయి.

జైన బౌద్ధాలవంటి అవైదిక మతాల ప్రభావాన్ని అద్వైత, విశిష్టాద్వైత, శైవ సిద్ధాంతాలే తమిళనాడులో ఎదుర్కొన్నాయి. విశిష్టాద్వైత శైవసిద్ధాంతాలు రెండూ తమిళదేశంలోనే జన్మించి

నందువల్ల అవి పరస్పరమూ ఘర్షణ పడడమూ కద్దు. విశిష్టాద్వైతు లకు విష్ణువే పరదైవంకాగా శైవ సిద్ధాంతులకు శివుడే పరదైవము.

రామానుజుల కాలంలో శైవ సిద్ధాంత వాదులు రాజాదరణ పొందుతూ ఉండేవారు. ప్రజా బాహుళ్యంలో రామానుజులకు ప్రచారం ఎక్కువవుతున్న కొద్దీ తమ సిద్ధాంతానికి ప్రమాదము జరుగుతోందని వారు భయపడ్డారు. అందుకనే వారు రాజ సహాయాన్ని కోరారు.

అయితే శైవ సిద్ధాంత వాదులతో ఏకీభవించి రాజు ఎవరన్నది ఇంకా నిర్ధారణ కాకుండానే ఉన్నది. కిరుమికంఠ చోళుడు (క్రిములు చేత శరీరం తినబడిన వాడు) అని ప్రచారంలో ఉన్న కథలు చెబుతున్నాయి. అనేక చరిత్రకారులు ఆ రాజు ప్రథమ కులోత్తుంగ చోళుడని భావిస్తున్నారు. కొందరు ఆ రాజుకు శబ్ద విష్ణు వర్ధనుడనే ప్రశస్తి ఉన్నదనీ దాన్ని బట్టి అతడు మత మౌఢ్యం కలవాడుగా తోచడం లేదనీ అంటున్నారు. అయినా రామానుజులు క్రీ. శ. 1100 ప్రాంతంలో రాజాగ్రహానికి పాత్రులై ఆత్మ సంరక్షణార్థం చోళదేశాన్ని విడిచి వెళ్ళిపోయారని చరిత్రలో ఉన్నది. ఆ కాలంలో (1070 — 1118) చోళదేశాన్ని పాలించిన రాజు ప్రథమ కులోత్తుంగ చోళుడు. అందుచేత రామానుజులను బహిష్కరించడంలో పాత్ర వహించినది ప్రథమ కులోత్తుంగ చోళుడే అని భావించడం సమంజసమే అవుతుంది.

చరిత్ర ప్రారంభ దశలో రాజకీయాలూ మతమూ పెన వేసు కునే ఉండేవి. రాజెప్పుడూ సంఘంలో పలుకుబడీ ప్రాబల్యమూ కల సనాతన వర్గాల అండ దండలతోనే రాజ్యాన్ని పాలించే వాడు. ప్రథమ కులోత్తుంగుడూ ఆ విధంగానే పాలించాడు. అప్పటి సనాతనాచారపరులు ఎంతో పవిత్రంగా భావించే కొన్ని సంప్రదాయాలకు రామానుజులు వ్యతిరేకులు కావడంతో ఈ విశిష్టాద్వైత వేదాంతివల్ల సాంఘిక సామరస్యం విధ్వంస మవు

తుందని వారు రాజును నమ్మించగలిగారు. దాంతో రాజు కోపించి చర్య తీసుకున్నాడు. శివ విష్ణువులలో ఎవరు పరదైవ మనేది వేరే సమస్య.

ఒక రకంగా చోళరాజు రామానుజులను దేశంనుండి బహిష్కరించడం వైష్ణవ మతానికి ఉపకారమే చేసింది. తమిళ దేశపు సరిహద్దులను దాటి వైష్ణవం తన ప్రభావాన్ని మైసూరులో గూడా చూపగలిగింది.

## XI

శివుని కంటె పరదైవం లేదనే ఒప్పుదలను ఎలాగైనా సరే రామానుజుల నుండి రాబట్ట వలెనని చోళరాజున కాయన సలహాదారులు బోధించారట.

రామానుజులను తన ఆస్థానానికి తీసుకువచ్చేందుకు రాజు భటులని మఠానికి పంపించాడు. ఆ సమయంలో రామానుజులు నదిలో స్నానం చేస్తున్నారు. రాజ పురుషా గమనంతో రాబోయే ప్రమాదాన్ని ఊహించిన కూరేశులు ఎవరితోనూ ఏమీ చెప్పకుండానే సన్న్యాసి వేషం వేసుకుని రాజస్థానానికి వెళ్లారు. పెరియనంబి కూరేశులను స్వయంగా అనుగమించగా ఇరువురూ రాజ భవనం చేరుకున్నారు.

రాజిదివరలో రామానుజులను చూడలేదు. ఆయన కూరేశులనే గురువులుగా భ్రమించారు. కూరేశుల ముఖ వర్చస్సు రాజు నాకర్షించింది. రాజ గూఢచారి అయిన నలురాన్ కూరేశుల శిష్యుడుగా నటిస్తూ నిజానికి వచ్చినది రామానుజులు కాదనీ వారి శిష్యులు కూరేశులనీ రాజునకు అసలు రహస్యం తెలియజేశాడు. ఈ భేదాన్ని పట్టించుకోని రాజు కూరేశుల ముందొక తాటాకు పెట్టి

దాని మీద సంతకం పెట్టమన్నాడు. ఆ ఆకు మీద వ్రాసి ఉన్న దాన్ని కూరేశులు చదివారు. 'శివాత్ పరతరం నాస్తి' అంటే శివుని కంటె పరమైనది లేదు అని ఉన్నది. కూరేశులు దానికి 'ద్రోణ మస్తి తతః పరమ్' అని జోడించి సంతకం పెట్టారు. దీంతో కూరేశులు రాజును వెక్కిరించి నట్టయింది. శివ శబ్దానికి ఒకానొక కొలపాత్ర అన్న అర్థం కూడా ఉన్నది. ఈ శ్లేష నుప యోగించుకుని ఆకు మీద వ్రాసి ఉన్నదాన్ని అపహాస్యం చేస్తూ శివం కంటె పెద్దదైన కొలపాత్ర ద్రోణమున్నది అనే అర్థం వచ్చే నూత్న వాక్యాన్ని చేర్చారు. రాజున కెక్కడ లేని కోపమూ వచ్చి కూరేశుల కను గ్రుడ్లు పెకలించమని ఆజ్ఞాపించారు. రాజాజ్ఞ నిర్వర్తించేందుకు భటులు తమ దగ్గరకు రాకముందే కూరేశులు స్వయంగానే కళ్లు పెరుక్కుని 'అన్య మత సహనం లేని ఇలాంటి మూర్ఖులను చూచినందుకు నాకీ శాస్తి జరగవలసిందే' అన్నారు. దాంతో కోపోద్రిక్తులైన రాజ పురుషులు పెరియనంబి కళ్లను గూడా పెకలించి వేశారు.

విశ్వాస పాత్రులైన అనుచరులు కూరేశులనూ పెరియనంబినీ చోళ రాజధాని వెలుపలికి చేర్చారు.

వృద్ధులైన పెరియనంబి ఈ దారుణ హింసకు తట్టుకోలేక క్రమంగా నీరసించి వేదనా భారంతో మృతి చెందారు. కూరే శులు కూడా మనః క్లేశం తీవ్రంగానే పొందినా ధైర్యాన్ని పోగొట్టు కోలేదు. ఆయన తమ అనుచరులతో మన మీ కష్టాల నుండి బయటపడే రోజు తప్పక వస్తుంది అన్నారు.

శ్రీరంగం చేరుకున్నాక, కూరేశులు ఆలయంలోకి వెళ్లగూడ దని రాజాజ్ఞ జారీ అయింది. రామానుజులతో తమకేమీ సంబంధం లేదని బహిరంగంగా ప్రకటించినట్లయితే ఆలయ ప్రవేశాని కను మతిస్తామని కూడా కబురు చేశారట. అట్టి షరతులతో ఆలయా నికి వెళ్లకపోయినా నష్టం లేదని కూరేశు లన్నారుట.

రాజాజ్ఞా సమగ్ర స్వరూపం తెలిసిన రామానుజులకు వైష్ణవ మత శ్రేయస్సు దృష్ట్యా చోళ దేశాన్ని విడిచి వెళ్లిపోవడమే మంచిదని ఆప్తులైన శిష్యులు సలహా చెప్పారు. కూరేశులు తమకై చేసిన త్యాగానికి ఆయన హృదయం ద్రవించిపోయింది. ఏదో ప్రతిక్రియ చేయాలని ఆయన ఎంతగానో తహతహ లాడారు.

శ్రీరంగం విడిచి రామానుజులు నీలగిరి వనాలు చేరు కున్నారు. అక్కడ వారికి వైష్ణవ భక్తులైన వేటగాండ్రు కొందరు తటస్థ పడ్డారు. వారి నాయకుడు నల్లాన్ చక్రవర్తి. ఆయన జన్మతః బ్రాహ్మణుడే అయినా అందరినీ భగవత్సంతానంగా భావించేవాడు. ఒకసారి ఒక నిరుపేద ఛండాలుడు మరణించగా ఆయన దహన సంస్కారం చేసినందుకుగాను తక్కిన బ్రాహ్మణులు వెలివేశారు. దీని కాయ నేమి బాధపడలేదు గాని అప్పటి నుండి అరణ్యాలు చేరి నిష్కల్మషులైన ఆటవిక జనులకు అమర ప్రేమ సందేశాన్ని అందిస్తూ వారితోనే నివసిస్తున్నారు.

తమ మతానికి చోళ దేశంలో తటస్థించిన అత్యాచారాన్ని విని మిక్కిలి బాధపడిన ఆ కిరాతులు రామానుజులను తమతోనే ఉండిపొమ్మని బతిమాలారు. కాని రామానుజుల ఆలోచనలు వేరు విధంగా సాగాయి.

ఇంకా పశ్చిమానికిపోయి మైసూరు వాసులలో విశిష్టాద్వైతాన్ని ప్రచారం చేయాలని వారు తలపోశారు. నీలగిరి అడవి నివాసులు వారి ప్రయాణానికి అన్ని సదుపాయాలూ సమకూర్చారు.

రామానుజులు మైసూరు రాష్ట్రంలోని తొండమాను గ్రామాన్ని చేరుకున్నారు. ఆ గ్రామాన్నిప్పుడు తొన్నూరని పిలుస్తున్నారు. హొయిసల రాజ వంశానికి చెందిన విట్ఠల దేవుడు ఆ రోజుల్లో పరిపాలకుడుగా ఉండేవాడు.

ఆ విట్ఠల దేవుడు జైన మతానుయాయులు. ఢిల్లీ చక్రవర్తులైన మహమ్మదీయుల తోడి యుద్ధాల ఫలితంగా ఆయన అంగ

వికలుడు కావడం తటస్థించింది. ఆయన కొక కుమార్తె ఉండేది. ఆమె కేదో దయ్యం పట్టింది.

రామానుజు లా రాజ్యాన్ని చేరుకున్న సమయానికి అంగ వికలులతో సహ భోజనాన్ని తమ మతం అంగీకరించదని రాజు చేసే విందులను జైనాచార్యులు బహిష్కరిస్తున్నారు. అందుచేత వారంటే రాజుకు కోపంగా ఉండేది.

చోళ దేశం నుండి ఎవరో మహానుభావులు వచ్చారన్న వార్త వినగానే విట్ఠల దేవునకు వారిని తన ఆస్థానానికి ఆహ్వానించాలని తోచింది. తాను అంగవికలు డన్న కారణాన తన్ను అగౌరవ పరచనందుకు రామానుజులంటే రాజున కెంతో సంతోష మయింది. ఆయన కుమార్తెకు పట్టిన దయ్యాన్ని రామానుజు లవలీలగా వదిలించి వేశారు. విట్ఠల దేవుడు వైష్ణవుడై విష్ణువర్ధన రాయలనే నూతన నామాన్ని స్వీకరించారు.

రాజానుమతో ధర్మః అన్నట్లు ఆయన ననుసరించి వేల కొలది మైసూరు వాసులు వైష్ణవు లయ్యారు.

మైసూరులో ఉండగా రామానుజులొక పర్యాయం తిరునారా యణపురమనే మేల్కోటకు వెళ్లారు. అక్కడ ఒక చిక్కని అడవిలో ఒంటరిగా తిరుగుతూ ఉండగా తులసీ గ్రంథం ఆయ న్నాకర్షించింది. ఆ చుట్టు కలియజూసి వారు ప్రార్థనలు చేశారు. ఇంతలో అక్కడ ఒక పుట్టలో అడుగున ఉన్న విష్ణు ప్రతిమ వారికి కనపడింది. విట్ఠల దేవుని సహాయంతో అక్కడ ఆలయాన్ని నిర్మింపజేసి అందులో ఆ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. పూర్వ మక్కడ మరొక విగ్రహం కూడా ఉండేదనీ దాన్ని మహమ్మ దీయుల దండయాత్రలలో ఢిల్లీకి తీసుకుపోయారనీ రామానుజులు విన్నారు. ఆ విగ్రహాన్ని తిరిగి తెచ్చేందుకు రామానుజులు ఢిల్లీకి గూడ వెళ్లినట్లు ప్రజలు చెప్పుకుంటారు. ఢిల్లీ పాదుషా కుమార్తె ఆ మూర్తి నెంతో ప్రేమతో దాచుకునేదట. రామానుజులు చక్ర

వర్తిని దర్శించి ఆయనతో ఎన్నో రోజులు వాదించి చివరికి ఆ విగ్రహాన్ని తీసుకుపోయేందుకు అనుమతి పొందారని చెప్పుకుంటారు. కాని ఈ కథకు మూలమైన ఆధారమేమీ తెలియడంలేదు.

ఆయన మైసూరుకు తిరిగి రాగానే ఆ విగ్రహాన్ని కాజేయాలని శత్రువులు ప్రయత్నించారట. కాని రామానుజుల కండగా ఉంటున్న అస్పృశ్యు లందరూ ఆ ప్రయత్నాన్ని విఫలం చేశారు. ఆ విగ్రహ సంరక్షణ విషయంలో అస్పృశ్యులు తమకు తోడ్పడిన విధానానికి సంతోషించి తిరునారాయణ దేవాలయంలో వారి ప్రవేశానికి రామానుజులు అనుమతించారు. ఈ విధంగా చట్ట రీత్యా అస్పృశ్యతా నిర్మూలనం అమలులోనికి రావడానికి ఎంతో కాలం ముందుగానే రామానుజులు హరిజనుల ఆలయ ప్రవేశాన్ని అనుమతించడం గమనించ దగింది.

తొండనూరులో 'మోతీతలాహ్' అనే సరోవర మొకటి ఉన్నది. దీన్ని రామానుజులే నిర్మించినట్లు ప్రతీతి ఉన్నది. రామానుజుల ఆదేశాన్ననుసరించే ప్రక్కనున్న చిన్న నదికి ఆనకట్ట కట్టి ఈ సరోవరంలోకి నిత్యం నీరు పారే ఏర్పాటు చేశారని హిల్టన్ బ్రౌను వ్రాశారు.

మేల్కోటలో రామానుజులు ఏడు వందల మఠాలు స్థాపించారట. వారియందు ప్రగాఢ భక్తి విశ్వాసాలు గల ముఖ్య శిష్యులు ఏబది యిద్దరు ఉండేవారు. ప్రథమ కులోత్తుంగుడు మరణించిన తరువాత రామానుజులు శ్రీరంగం వెళదామనుకుంటే శిష్యులు దానికి అంగీకరించ లేదు. రామానుజు లెల్లాగో వారిని ఒప్పించి, దేశంలో వైష్ణవ ధర్మ జ్యోతిని ఉజ్వల్యంగా వెలిగింపజేయడమే తమయందు ప్రేమాభిమానాలను చూపడమని వారికి నచ్చ చెప్పారు.

శ్రీరంగంలో కంటె మేల్కోటలో ఉండగానే రామానుజులు కొన్ని ఉత్తమ సంస్కరణలు ప్రవేశ పెట్ట గలిగారు. అస్పృశ్యత

కాయన హృదయం పూర్తిగా వ్యతిరేకం. నిజాని కాయన వారిని పవిత్ర కులోద్భవులని తిరుకులత్తార్ అన్న పేరుతో పిలిచేవారు.

మహమ్మదీయ చక్రవర్తి కుమార్తె మేల్కోటనుండి తెచ్చిన విష్ణు విగ్రహాన్ని విడువ లేనంతగా అభిమానించడం గమనించి ఆ నారాయణ మూర్తి పాద పద్మ సమీపంలో ఆమె ప్రాతినిధ్యం ఎల్లప్పుడూ ఉండేటట్లు ఏర్పాటు చేశారు. రామానుజులీ విధంగా కుల పరిధులనే కాక మత పరిధులను గూడా అధిగమించి తమ హృదయ వైశాల్యాన్ని వెల్లడించారు.

వారు మైసూరులో పన్నెండేళ్లు ఉన్నారు. అసహిష్ణుడైన చోళ రాజు గతించిన తరువాత స్వదేశానికి తిరిగివెళ్లాలని నిశ్చయించు కున్నారు. మేల్కోటలోని వైష్ణవులకు ఆలయ నిర్వహణ విధా నాలను వివరంగా తెలియజేసి శ్రీరంగానికి బయలుదేరారు.

## XII

శ్రీరంగం చేరగానే రామానుజులు తమ ముఖ్య శిష్యులైన కూరేశు లను చూడడానికి వెళ్లారు. కూరేశులకు భౌతిక దృష్టి పోయిందే గాని అంతర్దృష్టి ఏమాత్రమూ చెక్కుచెదరలేదు. రామాజునులు తిరిగి వచ్చినందుకు ఆయన మహానందం పొందారు.

రామానుజులు కూరేశుల్ని హృదయానికి హత్తుకుని 'నీ స్పర్శచే నేను పవిత్రుడ నయ్యాను. నిన్ను చూసి ఎంతో గర్వ పడుతున్నాను' అన్నారు.

అంథ కూరేశులు ఆనంద బాష్పాలు రాల్చారు. అప్పుడు గురువులు బరువైన హృదయంతో 'మనం కంచికి వెళ్లి నీ కళ్ల కోసం వరదరాజ స్వామిని ప్రార్థిద్దాము' అన్నారు.

కూరేశులకు చూపును గూర్చిన ఆలోచన కంటె కంచికి వెళ్లా

లన్న సూచన ఉత్సాహాన్ని కలిగించింది. రామానుజుల సలహాకు వెంటనే అంగీకరించి అప్పటికప్పుడే వరదరాజస్తవ మనే సుదీర్ఘ స్తోత్రాన్ని రచించారు. ఆ స్తోత్రాన్ని ఆలయంలో గానం చేయ మని రామానుజులాయన్ని కోరారు.

శిష్యునితో పాటు గురువులు కంచిని చేరుకున్నారు. ఈ సందర్భానికై తాము కూర్చిన స్తోత్రాన్ని ఆలయంలో స్వామి ఎదుట కూరేశులు గానం చేసేసరికి ఆ స్తోత్ర మాధుర్యానికీ, అర్థ గాంభీర్యానికీ వరదరాజ స్వామి ముగ్ధులయ్యారు. ఆలయ పూజారు లలో ఒకరిని ఆవేశించి కూరేశుల నుద్దేశించి 'కుమారా! నీ కోరి కేమిటో....' అని అడిగారు.

సరిగ్గా ఆ సమయంలో కూరేశుల మనస్సులో తన్ను చోళ రాజుకు పట్టి యిచ్చిన కపట శిష్యుడు నలురాన్ మెదలుతున్నాడు. అందుచేత కూరేశులు వెంటనే 'స్వామీ! నలురాన్‌ను మీ పరమాను గ్రహానికి పాత్రుణ్ణి చేయండి' అన్నారు.

'తథాస్తు' అన్నారు స్వామి.

రెప్పపాటు కాలంలో ఇంత పనీ జరిగిపోయింది. కూరేశుల చుట్టూ ఉన్న జనమంతా నిర్ఘాంతపోయారు. రామానుజులు కూరేశు లను ఆపేక్షతో బుజం తడుతూ 'వత్సా! నీకు నీవే సాటి. పోయిన నీ చూపును గూడా లక్ష్యం చేయక నీ శత్రువుకు శ్రేయస్సు కల గాలని ప్రార్థించావు. వైష్ణవులు పరమానందాన్ని పొందే రోజిది' అని ఆర్ద్ర హృదయులై అభినందించారు. కూరేశులకు దృష్టి రాలే దని తక్కిన శిష్యులందరూ ఆవేదన పడుతున్నారు. అందుచేత గురువులు కూరేశులతో 'ఈ మహత్తర త్యాగం వల్ల నీ వనుభ విస్తున్న పరమానందాన్ని నే నెరుగుదును. కాని కుమారా! స్వామి నీకు చూపు ననుగ్రహించలేదని వీళ్లందరూ ఎలా బాధపడు తున్నారో గమనించు. అందుచేత దయవుంచి స్వామిని మళ్లీ

ప్రార్థించు. నే నొక్కడనే ఆనందా న్ననుభవించడం స్వార్థమే..' అంటూ అర్థోక్తిలో ఆగిపోయారు.

కూరేశులు చిరునవ్వు నవ్వి స్వామి కభిముఖంగా సాష్టాంగపడి 'స్వామీ! భవదీయ దివ్య సౌందర్యాన్ని చూసేందుకు మాత్రమే దృష్టిని నా కనుగ్రహించు' అని వేడుకున్నారు.

స్వామి వెంటనే 'నీ కోరిక నెరవేరుతుంది. భౌతిక పదార్థాలేవీ నీ దృష్టి గోచరం కావు' అని అనుగ్రహించారు.

రామానుజులు కూరేశులను కౌగిలించుకున్నారు. శిష్యుల నుద్దేశించి 'కూరేశుడు మనలో ఒకడు కావడం మన వైష్ణవ ధర్మానికే అఖండ విజయం. అతడు తన శత్రువులకే మోక్షాన్ని సాధించి పెట్టాడు. అతని ద్వారా నే నందరికీ మోక్షాన్ని సాధిస్తాను' అంటూ ఉద్బోధించారు.

కళ్లు పోయిన తరువాత రామానుజులను చూడాలన్న కోరిక మాత్రమే కూరేశుల కుండేది. ఆ కోరిక తీరడంతో ఆయన మరణానికి సిద్ధపడ్డారు. తరువాత కొద్ది కాలానికే ఆయన మంచాన పడ్డారు. తమ శిష్యుడు భగవంతుని దివ్య పాదారవింద సాన్నిధ్యాన్ని చేరుకునే సమయ మాసన్నమైనదని రామానుజులు గ్రహించారు. ఆప్తుల నందరినీ ఓదారుస్తూ 'కూరేశులు మనందరి కంటె ముందుగా స్వామిని చేరుకుంటున్నారు. అంతవరకూ ఆయన ధన్యులే. అంటే స్వామి దృష్టిలో మన మీ మానవ శరీరాలతో చెయ్యవలసిన పనులింకా ఎన్నో ఉన్నాయన్నమాట. ఆయన ఆజ్ఞను మనం శిరసావహిద్దాము. కూరేశుల కొక కుమారుడున్నాడు. అతడు భక్తిలో గాని ప్రతిభా సామర్థ్యాలలో గాని తండ్రికేమాత్రమూ తీసిపోడు. చిరంజీవి పరాశరుడు ఎప్పటికైనా వైష్ణవ మహా సామ్రాజ్యాన్ని అఖండంగా పాలిస్తాడు' అని రామానుజులు ధైర్యం చెప్పారు.

అలా అంటూనే రామానుజులు పరాశరుని తలపై పుష్ప కిరీటాన్ని పెట్టగా అందరూ ఆయువకుణ్ణి ఆశీర్వదించారు.

కూరేశుల ముఖం తృప్తితో వెలిగింది. రామానుజుల పాద పద్మాలను భక్తితో స్పృశిస్తూ ఆయన నిశ్చింతగా ప్రాణాలు విడిచారు.

కూరేశులకి కావేరీ నదీ తీరంలో సంస్కారం జరిగింది. ఆ రోజంతా వైష్ణవులు భజనలతోనే గడిపారు. అన్ని వైపుల నుండీ మహా ప్రవాహంగా వైష్ణవులు వచ్చి కూరేశులకు తమ అంతిమ శ్రద్ధాంజలి సమర్పించారు. ఆ మహానుభావునకు స్మారకంగా బీదలకూ, వృద్ధులకూ, వికలాంగులకూ ఆ రోజు విరివిగా అన్న దానం చేశారు.

కూరేశుల నిర్యాణంతో అత్యంత ప్రియ శిష్యుణ్ణి కోల్పోయిన రామానుజులు లోపల్లోపల ఎంత వేదన చెందినా తమ దుఃఖాన్ని నిగ్రహించుకో గలిగారు. అప్పటినుంచీ వారు శ్రీరంగం విడువనే లేదు.

ఒక రోజున శ్రీరంగనాథ స్వామికి ఊరేగింపు జరుగుతోంది. స్వామి దర్శనానికి జనం గుమిగూడుతున్నారు. స్వామి వారి కల్యాణమూర్తి పూలతో దండలతో రమ్యంగా అలంకృతమై ఉన్నది. ఆ సమయంలో మఠంలో ఉన్న రామానుజులూ వారి అనుచరులూ బైటికి వచ్చి స్వామిని సేవించుకున్నారు. రామాను జులు నాలుగు వైపులా పరకాయించి చూచారు. తమ శిష్యులలో అంధ్రపూర్ణు డెక్కడా కనిపించలేదు. వారు వెంటనే లోపలికి వెళ్లి చూస్తే ఆయన వంట యింట్లో ఉన్నారు. 'స్వామి దర్శనానికి రాలే దేమి బాబూ' అని అడిగారు రామానుజులు. అంధ్రపూర్ణుడు 'స్వామీ! తమకోసం నేను పాలు కాస్తున్నాను. గురుసేవ దేవ సేవే అవుతుంది గదా' అని బదులు చెప్పారు.

రామానుజుల గొప్పతనం ఈ విషయంలోనే ప్రస్ఫుటంగా

కనిపిస్తుంది. వారు తమ శిష్యులందరినీ అత్యంత నమ్ర మూర్తులుగా తీర్చి దిద్దగలిగారు. వారి శిష్యులలో ఒకరైన అనంతఆళ్వాన్ అభిప్రాయంలో నిజమైన వైష్ణవుడు కొంగకూ, కోడికీ, లవణానికీ సదృశంగా ఉంటాడు. కొంగ చిన్న చేపలను చూసీ చూడనట్లు ఊరుకుని పెద్ద వాటినే పట్టుకుంటుంది. అలాగే నిజమైన వైష్ణవుడు జీవితంలో అల్ప విషయాలకు ప్రాముఖ్యమియ్యక అమూల్య లక్ష్యాలను సాధించడానికే యత్నిస్తాడు. కోడి దుమ్మునూ ధూళినీ పరిత్యజించి తనకు ముఖ్యమైన ఆహారాన్నే ఏరుకుంటుంది. అలాగే వైష్ణవుడు విస్తారమైన శాస్త్రాలలో నుండి ముఖ్యాంశాలనే గ్రహిస్తాడు. ఉప్పులేని ఆహార పదార్థమే ఉండదు. అదే విధంగా వైష్ణవ సేవ వలననే సమాజం నిలుస్తోంది.

భాగవత సాంప్రదాయంలో అందరూ సమానులే. ఒకప్పుడు నాంజీరు శిష్యులైన నంబిళ్లై తమ శిష్యుడు శివకరై పిళ్లై చేయి పుచ్చుకుని దారివెంట నడుస్తున్నారు. దారిలో ఒక శ్రీ వైష్ణవుడు పడుకొని ఉండి నంబిళ్లైని చూసికూడా లేవలేదు. శిష్యునకు కోపం వచ్చి ఆ వైష్ణవునితో 'గురువులు వస్తున్నారు ప్రక్కకు పో' అని గట్టిగా అన్నాడు. దాంతో నంబిళ్లై శిష్యుని చేయి విడిచి పెట్టి ఒంటరిగానే నడువసాగారు. గురువుల మనోభావ మర్థంకాక శిష్యుడు వారి వెంట పరుగెత్తాడు. 'స్వామీ! అపచార మేమైనా జరిగిందా' అని ఆక్రోశించాడా శిష్యుడు.

'అవు' నంటూ నంబిళ్లై ఆగకుండా ముందుకు పోతూనే 'తోడివారి నవమానిస్తే నన్నవమానించి నట్లే. మన మందరమూ ఆ భగవంతుని బిడ్డలమే. నువ్వవమానించిన ఆ వైష్ణవుని కంటే నే నే విధంగానూ గొప్పవాణ్ణి కాను. నీకింకా వైష్ణవ తత్త్వం ఒంటబట్టలేదు బాబూ!' అన్నారు.

రామానుజుల శిష్యులలో ఎందరో స్త్రీలుండేవారు. మోక్ష

లబ్ధికి శ్రీదేవి, ఆమె అనుగ్రహమూ అవశ్యకమని భావించే మతానికి ప్రవక్తలైనందువల్ల సంఘంలో స్త్రీకి ఉండవలసిన ప్రాముఖ్యాన్ని వారు బాగా గుర్తించారు. వారి శిష్యరాండ్రలో కొందరు తాత్త్విక చర్చలలోనూ పాల్గొనేవారు.

కూరేశుల ధర్మపత్ని ఆండాళ్ గొప్ప విద్వాంసురాలు. ఆమె రామానుజ మతంలోని స్త్రీల కందరకూ నాయకత్వం వహించేది. ఆమెకి సంబంధించిన ఒక ఆసక్తికరమైన కథ ప్రచారంలో ఉన్నది. ఒకసారి ఆమె నిర్విరామంగా పెద్ద వాన కురుస్తున్నందు వల్ల భర్త తిండిలేకుండా ఉండిపోవలసి వచ్చినందుకు ఆమె భగవంతుడైన రంగనాథస్వామినే దుయ్యబట్టింది. 'ఒక నిజమైన భక్తుడు మల మల మాడుతూ ఉంటే నీ వింత నిశ్చలంగా ఎలా ఉన్నావు స్వామీ?' అని నిగ్గదీసింది. కొద్ది క్షణాల్లోనే ఎవరో తలుపు కొట్టినట్లయి ఆమె వెళ్లి తెరిచింది. కోవెల పూజారి కూరేశుల కాహారం పట్టుకువచ్చి గుమ్మంలో నిలబడి ఉన్నాడు. ఆమె అంతటి మహాత్మురాలు. ఆమె ధైర్యానికీ విద్వత్తుకూ రామానుజు లామె నెంతగానో గౌరవించేవారు.

భర్త యెడలా భగవంతుని పట్లా మహా భక్తురాలైన పొన్నాచి, ఉరంగవిల్లి ధర్మపత్ని, ఆ రోజుల్లో అందరి ఆదరాభిమానాలనూ చూరగొన్నది. తామూ ఉత్తమ దంపతుల పట్ల చూపుతున్న అధికాభిమానాన్ని పురస్కరించుకుని ఇతర శిష్యుల మనస్సు లలో బయలుదేరిన అల్పపుటూహలను తొలగించడానికి రామానుజులు ఉద్దేశ పూర్వకంగా ఒక సన్నివేశాన్ని కల్పించడం గూర్చి మన మిదివరకే చదివి ఉన్నాము.

కొంగు దేశంలో (ఇప్పటి కోయంబత్తూరు ప్రాంతం) పెద్ద కరువు వచ్చినందువల్ల కొంగు ప్రత్తి అనే ఒకామె శ్రీరంగానికి తరలి వచ్చింది. ఆమె మొదట్లో శ్రీరంగంలో కొద్ది కాలమే ఉందామను కున్నది గాని రామానుజుల దర్శనం చేసుకున్న తర్వాత అక్కడనే

స్థిర నివాసంగా ఉండిపోయింది. సుదూర ప్రాంతాల నుండి శ్రీరంగానికి వచ్చి మఠంలో ఉండిపోయిన స్త్రీలు చాలామంది ఉన్నారు. తిరువనంతపురత్తు అమ్మై, తిరువత్తారు అమ్మై, తిరువాన్ పరిసరత్తు అమ్మై మొదలైన వారి వ్యవహార నామాలే వారు ఎక్కడెక్కడ నుండి వచ్చినదీ తెలియజేస్తున్నాయి. దీన్ని బట్టి పురుషులతో పాటు సమానంగా స్త్రీల నాదరించిన మతాచార్యులలో రామానుజులే ప్రథములని రుజువవుతోంది.

తాము దోషాతీతులమని రామానుజుల లెన్నడూ భావించలేదు. తమ తప్పులను ధైర్యంతో ఒప్పుకునేవారు. శ్రీ భాష్య రచనా సందర్భంలో తమ దృక్పథంతో ఏకీభవించని కూరేశుల వాదాల్లోని ఔచిత్యం వారు వెంటనే గుర్తించి ప్రశంసించిన సంగతి మన మిది వరకే తెలుసుకున్నాము. తిరుపులింగూడి నుండి మఠానికి వచ్చిన ఒకామె తన జ్ఞాపకశక్తితో రామానుజుల నొక పర్యాయం ఆశ్చర్య చకితుల్ని చేసింది. రామానుజు లామెను 'మీ వూరు నుండి తిరుకురుగూరు కెంత దూరం' మని అడిగారు. ఆమె వెంటనే మీ కాళ్వారుల స్తోత్రాలు రావా అని అడిగింది. తిరుపులింగూడి నుండి తిరుకురుగూరు కూతవేటు దూరంలో ఉందని వర్ణించే స్తోత్ర పంక్తి రామానుజులకు వెంటనే స్మృతికి వచ్చింది. పక్కనున్న శిష్యుల నుద్దేశించి రామానుజులప్పుడు 'ఈ పాండ్య దేశంలో అతి సామాన్య వ్యక్తులు కూడా నన్ను మించిన వారే' అని అన్నాడు.

నిజమైన శిష్యుడెన్నడూ దైన్యంతో బాధపడరాదనీ, ఇతరుల నుండి సానుభూతి నాశించ గూడదనీ రామానుజులు తమ శిష్యులకు బోధిస్తూ ఉండేవారు. ఈ విషయాన్ని గూర్చి ఒక కథ వుంది. విష్ణు వాహనమైన గరుత్మంతు డొక మాటు ఒక విదేశానికి వెళ్ళాడు. అక్కడ ఒక శ్రీవైష్ణవ వనిత ఉండి ఆయనకు అతిథ్య మిచ్చింది. గరుత్మంతు డామె వైష్ణవులు లేని దేశంలో నివసిస్తుదన్న సానుభూతి ప్రకటించాడు. ఆ ఊహ

ఆయనకు రాగానే ఆయన రెక్కలు రాలిపోయాయి. ఇలా ఎందుకు జరిగిందో ఆయనకు అర్థం కాలేదు. అప్పుడు భగవంతుడు 'నిజమైన వైష్ణవుడు తాను సానుభూతిని కోరడు, ఇతరులపట్ల సానుభూతిని చూపే అధిక్యం తనకున్నదని భావించడు' అని బోధించాడు.

రామానుజులు మైసూరు నుండి శ్రీరంగానికి వచ్చిన తరువాత ఆలయ నిర్వహణ విధానంలోనూ అక్కడ జరిగే పూజా పురస్కారాలలోనూ అనేక నూతన సంస్కరణలు ప్రవేశ పెట్టాలని ప్రయత్నించారు. మేల్కోటలో ఆయన అనుకున్నట్లు అవలీలగా చెయ్యగలిగారుగాని ఇక్కడ వారి ప్రయత్నాల కన్నింటికీ పూజారు లడ్డుతగిలారు. వాళ్లు రామానుజులను వదిలించుకోవాలని ఎలా ప్రయత్నించినదీ అయినా రామానుజులెలా బయటపడినదీ మన కిదివరకే తెలుసు. రామానుజులు మేల్కోటలో హరిజనుల ఆలయ ప్రవేశాని కవకాశం కల్పించిన సంగతి విస్పష్టమవుతూ ఉన్నా వారా సంస్కరణ శ్రీరంగ దేవాలయ విషయంలో చేయ లేక పోవడం ఆశ్చర్యాన్నే కలిగిస్తుంది. శ్రీరంగంలో సనాత నాచారపరుల బలాధిక్యం దీనివల్ల రుజువవుతోంది. కాని రామానుజులు మతాన్ని సంకుచిత నిరర్థక మూఢాచారాల నుండి ఉద్ధరించాలని నిర్విరామంగా కృషిచేశారు.

# XIII

రామానుజులు పూర్ణపురుషాయుష జీవులు. నూట యిరవై యేళ్ల ఆయుర్దాయాన్ని పూర్తిగా అనుభవించారు. మైసూరు నుండి తిరిగి వచ్చాక మరణ పర్యంతం మిగిలిన యిరవై సంవత్సరాల కాలమూ తాము పూర్వం చేసిన కృషి నంతటినీ వ్యవస్థితం

చేస్తూ గడిపారు. ఒకరి తర్వాత ఒకరుగా వారి శిష్యులందరూ గతించారు. కూరేశుల మరణం వారికి తీవ్రాఘాతమే అయింది. భౌతిక శరీరం ప్రకృతి నియమాన్ననుసరించి గతించేదే అయినా అనంతానంద ధామమైన వైకుంఠంలో జీవుడు శాశ్వతుడై ఉంటాడని వారి నమ్మకం. కూరేశుల భార్య ఆండాళ్‌ను ఆచార్యులీ మాటలతోనే ఓదార్చారు గాని నిజానికామె భర్త పోయిన తరువాత ఎక్కువ కాలం జీవించలేదు.

కూరేశుల ముఖ్య స్నేహితులైన ఉరంగవిల్లి మఠానికి చెందిన కార్యకలాపాలు అన్నిటినుండీ విరమించుకుని, ప్రశాంతంగా మరణించారు. రామానుజు లాయన అంతిమ సంస్కారాలను మహా వైభవంతో జరిపించారు. ఆయన శరీరాన్ని పూల పల్లకిలో పెట్టి భాగవతులూ, బ్రాహ్మణులూ భుజాల మీద ఎత్తుకుని ఊరేగించారు. ఆయన భార్య పొన్నాచి భర్తృ మరణవార్త వింటూనే ప్రాణాలు విడిచింది. భర్త దేహంతోనే ఆమె దేహానికి అంతిమ సంస్కారం జరిగింది.

రామానుజులకూ అంతిమ సమయం ఆసన్నమైంది. వారి సిద్ధాంతం విస్తృతంగా వ్యాపించి నందువల్ల ప్రతినిత్యమూ మఠానికి వారి దర్శనం కోసం వేలకొలది జనులు వచ్చేవారు. ఒకప్పుడే కొద్దిమందికో పరిమితమైన వైష్ణవ మతం ఇప్పుడు బహుళ ప్రచారాన్ని పొంది దక్షిణదేశ మంతటా వైష్ణవులే వెల్లివిరిశారు.

ఆళవందారు కోరికలు మూడింటినీ వారు తీర్చారు. రామానుజుల జీవితం సంపూర్ణంగా చరితార్థమైంది. బ్రహ్మసూత్రాలకు విశిష్టాద్వైత దృక్పథాన్ననుసరించి వ్యాఖ్యానాన్ని రచించారు. కూరేశుల ప్రథమ కుమారునకు పరాశరభట్టరని పేరు పెట్టి ఆ విధంగా ఆ మహర్షి దివ్య స్మృతిని శాశ్వతం చేశారు. నమ్మాళ్వారుకు కృతజ్ఞత తెలుపుకోవాలన్నది మరణించిన ఆళవందారు

మూడవ కోరిక. రామానుజులా కోరికను మహాత్ములైన ఆ ఆళ్వారు పేరును తమ ఆధ్యాత్మిక వారసులైన నంబిళ్లైకు పెట్టడం ద్వారా తీర్చారు. నంబిళ్లైను వారు తిరుకురుగై పిళ్లననే పిలిచేవారు.

ఆళ్వారుల స్తోత్ర రత్నాలకు వ్యాఖ్యానం వ్రాసే పనిని గూడా వారు నంబిళ్లై కప్పగించారు. శిష్యుడు తాను వ్రాసిన వ్యాఖ్యానాన్ని చూపించినప్పుడు వారెంతో ముగ్ధులయ్యారు. వారా వ్యాఖ్యానాన్ని భగవద్విషయమని వ్యవహరించి అది తమ శ్రీ భాష్యంతో సమానమని ప్రకటించారు. ఆళ్వారుల స్తోత్రాలకు వ్యాఖ్యానం వ్రాసే సంప్రదాయం నంబిళ్లై తోనే ఆరంభమయింది.

ఈ దశలో రామానుజులు చిదంబరాన్ని దర్శించినట్లు సాంప్రదాయిక చరిత్ర చెప్తున్నది. వీర శైవ మహారాజైన ద్వితీయ కులోత్తుంగుడు అక్కడి ఆలయంలోనుండి విష్ణు విగ్రహాన్ని తొలగించమని ఆజ్ఞాపించారట. ఆ విగ్రహాన్ని సముద్రంలో పారవేశారు. రామానుజులప్పుడు చిదంబరానికి వెళ్ళి దాన్ని మళ్లీ ప్రతిష్ఠించారట.

రామానుజులు తమ అనంతరం వైష్ణవ మత ప్రచారమూ, తన్నిర్వహణమూ సక్రమంగా సాగేటట్లు చూడడానికి డెబ్భై నలుగురు నాయకులను నియమించారు. తిరుకురుగై పిళ్లన్, నడదూరు ఆళ్వాన్, కిడంబియాక్కన్, ముదలియాండన్ - ఈ నలుగురూ శ్రీభాష్య ప్రచారానికి నియుక్తులయ్యారు. తిరుకురుగై పిళ్లన్ శ్రీభాష్యంతోపాటు తాము వ్రాసిన ఆళ్వారుల స్తోత్ర వ్యాఖ్యానాన్ని కూడా ప్రచారం చెయ్యాలి. అందుకనే వారిని భాష్య భగవద్విషయోపాయ సింహాసనాధిపతి అని పిలిచేవారు.

కూరేశుల కుమారులు పరాశర భట్టరునూ, శ్రీరామపిళ్లైనూ,

రామానుజులు తమ అధీనంలో ఉంచుకుని వారికి వేదాంత విద్యలో శిక్షణ ఇవ్వడానికి తమ సోదరులైన ఎంబరును నియోగించారు.

ఆళవందారు వలెనే పరాశర భట్టరు విశిష్ట ప్రతిభాశాలి. ఆయన చిన్నతనంలో వీథుల్లో ఆడుకునేటప్పుడు ఒకానొక గర్విష్ఠి పండితుడు తనంతటి వాడు లేడన్న అహంభావంతో నిర్లక్ష్యంగా వెడుతున్నాడు. భట్టరు ఆయనను చూసి తమరెవరని అడిగాడు. ఆ పండితుడు తాను తర్కంలో పరాజయ మెన్నడూ ఎరగని మహాత్ముడనని బదులు చెప్పాడు. ఆ గర్విష్ఠి సమాధానం విని భట్టరు రోడ్డుమీది దుమ్ము గుప్పెడితో తీసి సరిగ్గా అది ఎంత ఉంటుందో చెప్పమని అడిగాడు. ఆ కుఱ్ఱవాడు అటువంటి ప్రశ్న వేస్తాడని ఆయన ఊహించలేదు. ఆ ప్రశ్నకు సమాధానమూ తోచలేదు. బదులు చెప్పకుండా అతని వంక చూస్తూ నిలబడ్డాడు. భట్టరు చిరునవ్వు నవ్వి 'అయ్యా! మీరు మరింత చురుకుగా ఉండాలి. ఏముందిది గుప్పెడు దుమ్మని ఎందుకు చెప్ప లేక పోయారు?' అన్నాడు. ఆయన సంతోషించి తన పరాజయాన్ని అంగీకరించాడు. రామానుజు లీవార్త విన్నప్పుడు భట్టరును తమ దగ్గరకు రప్పించుకుని మనసారా ఆశీర్వదించారు. అప్పుడే రామానుజులు అతని మహోజ్జ్వల భవిష్యత్తు నూహించారు. వారి ఊహ యథార్థమే అయింది. భట్టరే రామానుజులకు వారసులయ్యారు.

అంత్యకాలం సమీపించగానే ఆచార్యుల వారు తమ శిష్యుల నందరనూ సమావేశపరిచి ప్రకృతి ధర్మాన్ననుసరించి తమ శరీరం విశ్లథం కాబోతోందనీ అందరివలెనే తామూ మరణించ నున్నామనీ చెప్పారు.

ఎంబరు ఒడిలో తల పెట్టుకుని, వడుగనంబి ఒడిలో కాళ్లు చాపి విశ్రమించారు. తక్కిన శిష్యులందరూ చుట్టూ చేరి కన్నీళ్లు కారుస్తున్నారు. అప్పుడు రామానుజులు 'ఈ సృష్టిలో నష్టమనే

దేదీ లేదు కాబట్టి ఎవ్వరూ దుఃఖించగూడదు. శరీరమే పోతోంది గాని ఆత్మ నిత్యమై ఉంటుందని విశ్వాసమున్న వారందరూ ఈ విషయాన్ని గుర్తిస్తారు. దైవం నిత్యమూ తనతోనే ఉంటున్నందు వల్ల జీవుడెన్నడూ ఒంటరి వాడు కాడు. ఆదైవాన్ని విడిచిపెడితే తమ్ము తాము వదులుకున్నట్లే' అని బోధించారు.

అలా మరణ శయ్యపై ఉండగానే రామానుజులు తమ వేదాంత సందేశాన్నంతటినీ సమీకరించి శిష్యులకు బోధించి భగవద్విశ్వాసంతోడి విశిష్టాద్వైత సందేశాన్ని సర్వ జీవులకూ అందించండని కోరినట్లు చెప్పుకుంటారు.

వారి అంతిమ సందేశం ఇది.

"స్వామి నర్చించినట్లే శ్రీవైష్ణవుల నర్చించండి. వారి బోధలలో విశ్వాసముంచండి. ఇంద్రియాలకు దాసులు కాకండి. ప్రాపంచిక విజ్ఞానానికి పరిమితి ఉన్నది. పరంపరాగతమైన ఆచార్యోప దేశాల్లో నిమగ్నులు కండి. మీరు గురువనుగ్రహ పాత్రులయితే ఇంద్రియాకర్షణ మటుమాయ మవుతుంది. గురు కృపా పాత్రుడై విజ్ఞానాన్ని పొందిన వ్యక్తి కోరికలకు దాసుడు కానేకాడు. నిజమైన భక్తుడు భగవన్నామ వైభవాలకు తన్మయుడైనట్లే భగవద్భక్తుల నామ వైభవాలకూ తన్మయత్వంతో భజిస్తాడు. భాగవతుల నారాధించే వ్యక్తి భగవంతుణ్ణి త్వరగా చేరు కుంటాడు. నిజమైన వైష్ణవుడు తనకు తాను వాంఛించేదేమీ ఉండదు. నిత్యమూ, గంటసేపైనా దైవారాధనకు కేటాయించు కోవాలి. ఆళ్వారుల స్తోత్రాలనూ ఆచార్యుల ఉపదేశాలనూ అధ్య యనం చేయడానికి మరికొంత కాలం వినియోగించాలి. ప్రపత్తి పరుల సాహచర్యంతో మెలగుతూ పరమార్థాన్ని విశ్వసించని పాషండులకు దూరంగా ఉండండి. భోగలాలసులకు మీరు సన్ని హితులు కాకండి. భగవదర్చామూర్తిని కేవలం పాషాణ మను కునేవాడు, గురువును సామాన్య మానవుడుగా భావించేవాడు,

తీర్థోదకాన్ని పట్టి నీళ్లనుకునేవాడు, పవిత్ర మంత్రాలను నాద మాత్రంగా తలపోసేవాడు, పరమ దైవాన్ని సామాన్య దేవతగా భావించేవాడు రౌరవాది నరకాలకు పాత్రుడవుతాడు.

"ప్రపత్తి పరుడై భగవంతునకు ఆత్మార్పణ చేసుకున్నవాడు భవిష్యత్తును గూర్చి ఊహించనే కూడదు. ఆ విషయంలో ఏ మాత్రం సందేహించినా ఆత్మార్పణే వ్యర్థమవుతుంది. ఇప్పటి జీవితం పూర్వకర్మను బట్టి సాగుతోంది. అందుచేత దుఃఖించడం నిరర్థకం. విధ్యుక్త కర్మాచరణం భగవత్సేవకు గాని ప్రాపంచిక లక్ష్యాలను పొందడానికి గాదు.

"శ్రీ భాష్యాన్ని అధ్యయనం చేయండి. ఇతరులకు బోధించండి. ఇది మీకు సాధ్యం కాకపోతే నమ్మాళ్వారు రచనలనూ, తక్కిన ఆళ్వారుల స్తోత్రాలనూ చదివి వాటి నితరులకు చెప్పండి. ఇదీ చేయలేని పరిస్థితుల్లో భగవంతునకూ భగవద్భక్తులకూ పరి చర్యలు చేస్తూ ఏ పుణ్యక్షేత్రంలో నైనా జీవించండి. ఇది కూడా సాధ్యం కాకపోతే యాదవగిరి మీద ఒక చిన్న గుడిసె వేసుకుని ఉండండి. దీనికి స్తోమతు లేకపోతే ఉన్నచోటనే ఉండి భగ వంతుని శరణుపొంది ద్వయ మంత్రానుష్ఠానపరులై కాలక్షేపం చేయండి. ఇవన్నీ మీకు కష్టంగా తోచి మీ శక్తికి మించిన వనిపిస్తే ఏ వైష్ణవునైనా ఆశ్రయించి మీ అహంకారాన్ని నిర్మూ లించుకుంటూ ఆయన చెప్పినట్లు నడుచుకోండి.

"ఈ జగత్తులో శ్రీ వైష్ణవులే మీకు మిత్రులు. భగవద్విశ్వాసం లేనివారు మీకు శత్రువులే. కేవల లౌకికులను చూసి జాలిపడాలి. వారు శత్రువులూ కారు, మిత్రులూ కారు. సురభిళ పుష్ప సుగంధ ద్రవ్యాలతో ఉత్తమ తాంబూల సేవనం ఆనందాన్ని కలి గించినట్లు భాగవత సాంగత్యం మీకానందాన్ని ఇవ్వాలి. పాము, పులీ, అగ్నిజ్వాలలూ ఎదురైనప్పుడు పొందే ద్వేషాన్నే శత్రువులను చూసినప్పుడూ పొంది వారికి దూరంగా ఉండాలి. రాళ్లూ రప్పలూ

ఎటువంటివో లౌకికులటువంటివారు. వాళ్లను చూసినప్పుడు ఏ మార్పూ పొందకూడదు. శత్రువులకూ లౌకికులకూ దూరంగా ఉంటూ భక్తుల సాంగత్యంలో పరమానందాన్ని పొందండి. వారి అనుగ్రహం వల్ల మీలో వెలుగు ప్రజ్వరిల్లుతుంది.

"భావం శుద్ధమయితే ప్రవర్తన గూడా పరిశుద్ధ మవుతుంది. ఇతరులలో దోషాలు వెతుకుతూ కూర్చోకండి. దోషంలేని వ్యక్తి సృష్టిలో ఉండడు. ఇతరుల దోషాల నెత్తి చూపే అధికారం ఎవ్వరికీ లేదు. ఇతరులను సేవించడంలోనే మంచితన మున్నది. అంటే వారికి సర్వాత్మనా సహాయపడడ మన్నమాట!"

అలా ఉపదేశిస్తూనే రామానుజులు అంతిమ శ్వాస విడిచారు. చుట్టూవున్న శిష్యులందరూ నిగ్రహించుకోలేక బావురుమన్నారు.

శ్రీరంగంలోనూ పరిసర ప్రాంతాలలోనూ ఉన్న వైష్ణవులందరూ చేరి వేదమంత్రాలనూ ఆళ్వారుల స్తోత్రాలనూ పఠిస్తూ రామానుజులకు తమ అంతిమ శ్రద్ధాంజలిని సమర్పించారు. శ్రీవారి భౌతిక కాయాన్ని సాలంకృతంగా ఊరేగించి శ్రీరంగ దేవాలయంలోనే సమాధిచేశారు.

రామానుజుల విగ్రహాలను తిరుపతిలో, కంచిలో, శ్రీపెరుంబూదూరులో ప్రతిష్ఠించారు.

రామానుజుల వేదాంతం ఇతర వేదాంతాలను ప్రభావితం చేసింది. ఉత్తర దేశంలో బయలుదేరిన నూతనోద్యమాలన్నీ రామానుజుల ఉపదేశాల కెంతగానో ఋణపడి ఉన్నాయి. రామానుజుల తరువాత కొన్ని శతాబ్దాలకావిర్భవించిన భక్తి మహోద్యమ నాయకులు రామానందులు, చైతన్య ప్రభువు, రామదాసు మున్నగువారు పురుషోత్తముని యందు అనన్య భక్తి నాధారం చేసుకుని ఆధ్యాత్మిక సోదర భావాన్ని ప్రతిష్ఠించడంలో రామానుజులు సాధించిన ఫలితాల సహాయంతోనే శత్రు మతాల ఔద్ధత్యాన్ని ఎదుర్కోగలిగారు.

సుందర మహోన్నత విగ్రహులైన రామానుజులు జన్మతః జన ప్రియ నాయకులు. వైష్ణవుల కందరకూ ముఖ్యాచార్యులై శ్రీరంగంలో ఉండే ఆళవందారు కంచిలో ఉన్న కొద్ది కాలంలో రామానుజులను ఒక్కమాటు దూరాన్నుంచి చూసి తమ తరువాత ఆయనే ఉత్తరాధికారి కావాలని అప్పుడే నిశ్చయించుకున్నారు. తమ సన్నిధానంలో ఎందరో మహా పండితులైన శిష్యులున్నా వృద్ధులైన ఆళవందారు రామానుజులకే నాయకత్వం అప్పగించా లని కబురంపించారు. రామానుజులు వారి ఆశయాల నన్నింటినీ సఫలీకృతం చేశారు. విశిష్టాద్వైత మతాన్ని అవిచ్ఛిన్నంగా కొన సాగించడమేకాక భారతీయ మత ధార్మిక చరిత్రలో దానొక మహత్తర శక్తిగా రూపొందించారు.

రామానుజులు తమ కాలంలో ప్రచారంలో ఉన్న అన్ని వేదాంత దృక్పథాలనూ క్షుణ్ణంగా పఠనం చేసుకున్నారు. యాదవ ప్రకాశులవద్ద అద్వైతాన్ని అధ్యయనం చేశారు. వారి శ్రీ భాష్యాన్ని పరిశీలిస్తే వివిధ శాస్త్రాలలో వారికి ఉన్న అపార పాండిత్యం విదిత మవుతుంది. ఆ భాష్య రచనకు పూనుకోక ముందే దాని కవసరమైన విజ్ఞానాన్నంతటినీ సమకూర్చు కున్నారు. తాత్త్విక, నైతిక, ఆధ్యాత్మిక దృక్పథాల్లో విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని సువ్యవస్థితం చేశారు. తన సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించే టప్పుడు ఏ పండితుడైనా భిన్న వాదాలను ఎదుర్కోవలసి ఉంటుంది. వేదాంత వాదాలకు మాత్రమే పరిమితమై వ్యక్తిత్వాల మీదకు ప్రసరించనంత కాలం ఆ వివాదాలు క్షేమకారులే అవు తాయి. యాదవ ప్రకాశుల వేదాంత దృక్పథంతో రామానుజు లేకీభవించ లేదు. అయినా వారి యెడల ద్వేషభావం ఏ కోశానా

పొందలేదు. చివరకు యాదవులు తమ సిద్ధాంతంతో తామే విసుగుజెంది రామానుజుల మార్గ దర్శకత్వాన్ని కోరినప్పుడు సంతోషంతో వారి నాహ్వానించి ఆశ్రయమిచ్చారు.

సిద్ధాంత చర్చలలో ప్రతి స్పర్థులను పరాధూతులను చేయ డంలో రామానుజులు వాదనా పటిమతో తమ సౌజన్యాన్ని విని యోగించుకునేవారు. ఎదుటివాళ్ళు ఎంత కవ్వించినా వారెన్నడూ ఉద్రిక్తులయ్యేవారు కారు. ఉరుములతో మెరుపులతో పిడుగులు కురిసేటట్లు ఆర్భాటంగా వచ్చిన యజ్ఞమూర్తి రామానుజుల మధుర సాత్త్విక వర్చస్విత వల్ల ఎలా మెత్తబడి పోయిందీ మనం గమనించి ఉన్నాము. జయించాలని వచ్చిన వ్యక్తి జితుడై వెనక్కు మరలాడు.

రామానుజుల అభిప్రాయంలో అస్తిత్వమే సారానికి రుజువవు తుంది. భావాలు కార్య రూపంలో ఆచరించడానికే ఉద్దిష్టము లవుతాయి. ఆయన ఆగమనానికి ముందు వైష్ణవ మతం చెల్లా చెదరై ఉన్న చిన్న చిన్న సమాజాలకు మాత్రమే పరిమితమై ఉన్నది. రామానుజులే వాటి నన్నిటినీ సమీకరించి ఆ మతాన్ని విస్తృత ప్రమాణంతో బహుజనాకర్షకంగా మహోద్యమంగా విజృం భింపజేశారు.

నిజానికి వారి శిష్యులందరూ భిన్న భిన్న కులాలలో నుండి వచ్చారు. అయినా వారందరిలోనూ సహజైక్య భావాన్ని సముద్దీ పింపజేశారు రామానుజులు. ఈ విషయాన్ని నిరూపించే సాంప్ర దాయిక కథ ఒకటి ఉన్నది.

శ్రీరంగం పొలిమేరలలో ఒక అస్పృశ్యుడుండేవాడు. అతడెల్ల ప్పుడూ ఆళ్వారుల స్తోత్రాలు గానం చేస్తూ పారవశ్యం చెందే వాడు. రామానుజులు రోజూ నదికి వెళ్ళి వస్తూ ఆ భక్తుని గానాన్ని వింటూ ఉండేవారు. ఒకరోజున ఆయన అతని ఇంటికి వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. అందరూ స్నానాలు చేసి వస్తున్న కారణాన వెంట వస్తున్న శిష్యులను సాగిపొమ్మని రామానుజు లొక్కరే

అతని యింట్లోకి వెళ్ళారు. గురువులు తమ ఇంటికి వచ్చినందుకు పాపమా బీదవాడు ఉక్కిరి బిక్కిరై వారి కాళ్ళమీద పడ్డాడు. రామానుజు లతని గానాన్ని ఆలకిస్తూ అక్కడ మూడు గంటలు గడిపారు.

రామానుజులు మంచి మనస్తత్వ పరిజ్ఞాతలు. ఉరంగవిల్లి ప్రేమ పిచ్చిని చూసి శిష్యులు పరిహసిస్తూ ఉంటే అట్టి ప్రేమ వెనుక అమూల్యమైన హృదయ మున్నదని గ్రహించి రామానుజు లప్పుడే 'వైష్ణవం ప్రేమించే విధానాన్ని తెలిపే మతం. దాన్ని ప్రచారం చెయ్యడానికి ఉరంగవిల్లే తగినవాడు' అని వెల్ల డించారు.

ప్రజామోదం పొందే మతానికి భక్తి విశ్వాసాలే పునాదిరాళ్ళు. ఆరాధ్య దైవాన్ని బహిష్కరించిన ఏ మతమూ విజయవంతం కాలేదు. భగవంతుని దివ్యమంగళ విగ్రహాన్ని రామానుజులు భువన సుందరంగా అభివర్ణించడం జనుల హృదయాలను ఆక ర్షించింది. ఇందులో 'సత్యం, శివం, సుందరమ్' అన్న ఉప నిషద్భావన మూర్తీభవించింది.

పూర్వ ఋషి సంప్రదాయానికి చెందిన మహాత్ములైన ఆళ్వా రులు ప్రాణులెల్లరూ ఆనందోద్భవులని చెప్పారు. భగవంతు డానందమయుడన్నారు. భక్తులు ఆ ఆనందాన్నే వివిధ దశలలో అనుభవిస్తున్నారు. ఆనందానుభవంలో అత్యున్నతమైనదీ యదార్థ మైనదీ భగవదనుభవం వల్లనే సిద్ధిస్తుంది.

ఈశ్వరుడు మానవ రూపంలో భూమి మీది కవతరించడం భక్తుల హృదయాలను సమ్మోహితం చేసింది. శ్రీరామచంద్రుని ధార్మికత్వాన్ని కృష్ణభగవానుని హృదయావర్జక సౌందర్యాన్ని ఆళ్వారులు తమ అమరకవిత్వంలో ప్రతి పదంలోనూ ప్రస్ఫుటం చేశారు.

పెరియాళ్వారు దివ్యతనయ ఆండాళు కేవలం కృష్ణుణ్ణే గానం

చేసింది. ఆ కృష్ణుడు జార చోర శిఖామణి. స్త్రీల హృదయా లను వెన్నముద్దలుగా అపహరించిన పరమాత్మ. ఆమె రచనలలో ఆ పరమాత్మ తోడి దివ్య సమ్మేళనానంద మాధుర్యం వెల్లి విరుస్తూ ఉంటుంది.

ఆళ్వారుల స్తోత్రాలను అధ్యయనం చెయ్యడం రామానుజులు తమ శిష్యుల కవశ్య కర్తవ్యం చేశారు. వారెల్లప్పుడూ దివ్య ప్రబంధాల మనోహర పంక్తులను తమలో తామే గానం చేసు కుంటూ ఉండేవారు. ఆ పంక్తులు భక్తి విశ్వాస నిర్భరాలయి భక్తుల హృదయాలనే ఒలకబోస్తూ ఉంటాయి.

హైందవ సమాజం వర్ణ వ్యవస్థతో కూడినది. ఒక వ్యక్తి ఒక వర్ణంలో జన్మించడం అతని పూర్వకర్మ ననుసరించి ఉంటుంది. ఈ విశ్వాసం పురుష ప్రయత్న వైముఖ్యానికీ, భగవదనుగ్రహ పాత్రులము కాలేమన్న నైరాశ్యానికి దారితీసింది. ఈశ్వరుడు తన లీలా విలాసంలో పాల్గొనమని సర్వ మానవులనూ ఆహ్వా నిస్తున్నాడనీ, అందులో ఒక కులానికి చెందిన వాళ్లని సాంఘి కంగా వెలివెయ్యడం వారు పూర్వజన్మలలో చేసి ఉంటారనుకునే పాపంతో సమానమైన పాపమే అని రామానుజులు భావించారు. బ్రాహ్మణ పూజారులు బుజాలమీద మోసుకువచ్చి పంచమ భక్తు డైన తిరుపనాళ్వారును ఆలయంలో దింపిన కథ విని రామాను జుల హృదయం ద్రవించింది. ఆళ్వారుల దివ్య జీవితాలు బోధించే సత్యాలను రామానుజులు ప్రచారంచేసి ఆచరణలో పెట్టారు.

## XV

రామానుజుల అవతరణకు ముందు జ్ఞానార్జనకే అత్యంత ప్రాముఖ్య మిచ్చేవారు. కాని రామానుజులు ఏ వేదాంత దృక్పథ

మైనా దాని ననుసరించే వారి సంఖ్యా బలాన్ని పురస్కరించుకునే రాణిస్తుందనీ, శాస్త్రజ్ఞానం కర్మానుష్ఠానానికి తోడ్పడేదే కాని అదే ప్రధానం కాదని గుర్తించారు. ధర్మానుగుణంగా నీతి నియమాల ననుసరించడమే కర్మగా వారు భావించారు. కర్మ అవిద్యా ఫలితమన్న సిద్ధాంతాన్ని వారు త్రోసిపుచ్చారు. 'ధర్మానుష్ఠానంలోనే జ్ఞానం సార్థకమవుతోంది. సాంఘిక బాధ్యతలను గుర్తించి న్యాయ దృష్టితో కర్మాచరణం చెయ్యడం వల్లనే జీవితం అర్థవంత మవుతుంది' అని వారు ఉద్ఘాటించారు.

తమ తరువాత తాము ప్రారంభించిన ఉద్యమం అణగారి పోవటం రామానుజుల అభిమతం కాదు. అందుచేతనే వారు అది సుదీర్ఘంగా సాగాలని ఆ బాధ్యతను తమ ప్రియ శిష్యులు డెబ్బై నలుగురి కప్పగించారు.

రామానుజుల తరువాత శ్రీసూక్తి సింహాసనానికి పరాశర భట్టరు వారసులయ్యారు. విశిష్టాద్వైత భాష్య ప్రచార బాధ్యతను పిళ్లను స్వీకరించారు. నడాదూరు అమ్మకు ఆచార్యులైన విష్ణు చిత్తులు పిళ్లను శిష్యులు.

నవసహస్ర మన్న పేరుతో తిరువాయిమొళికి వ్యాఖ్యానం వ్రాసిన నాంజీరు పరాశరుల శిష్యులే. నాంజీరు శిష్యులైన పెరియ వక్కన్ పిళ్లై చతుర్వింశతి సహస్ర మన్న పేరుతో దివ్య ప్రబంధానికి జగత్ప్రసిద్ధమైన వ్యాఖ్యానం వ్రాశారు. తిరువాయిమొళికి ఇదు (ఇదు అంటే మూలానికి సమానమని అర్థం) అనే నిపుణమైన వ్యాఖ్యానం వ్రాసిన వడకు తిరువీధి పిళ్లై నంబిళ్లైకు వారసులయ్యారు. వీరి కుమారులు పిళ్లై లోక ఆచార్యులు వైష్ణవంలో తెంగలై శాఖను స్థాపించినవారని నమ్ముతారు.

రామానుజుల తర్వాత వచ్చిన వారిలో వేదాంత దేశికులే అత్యుత్తమాచార్యులు. వారు అప్పులార్, నడాదూరు అమ్మ, విష్ణు చిత్తులు,

పిళ్లను మొదలైన సంప్రదాయ గురు పరంపరాక్రమంలో వచ్చిన వారు. ఇరవై యేళ్ల చిన్న వయస్సులోనే సర్వ తంత్ర స్వతంత్రు లన్న పేరు పొందారు. అంటే వారు సర్వ విజ్ఞాన శాఖల్లోనూ పరినిష్ఠితు లన్నమాట. రామానుజుల వలెనే వారు కూడా వేల కొలది వైష్ణవులను హతమార్చడం జరిగిన మాలిక్ కాఫరు కాలంలో, శ్రీరంగం విడిచి వెళ్లవలసి వచ్చింది. అయితే ఈ దారుణ హత్యాకాండ అట్టే కాలం సాగలేదు. వేదాంత దేశికులు అచిరకాలంలోనే శ్రీరంగానికి తిరిగి వచ్చి శ్రీరంగనాథస్వామి పునఃప్రతిష్ఠితులై ఉండడం చూసి సంతోషించారు.

వారి రచనలు విజ్ఞాన శాఖల కన్నింటికి సంబంధించి అతి విస్తృతంగా ఉన్నాయి. జ్ఞానమీమాంస, తత్త్వమీమాంస, ఆచార కాండ, అలంకార శాస్త్రము, ధర్మ శాస్త్రము – ఇత్యాదిగా అనేక విజ్ఞాన రంగాలలో గ్రంథాలు రచించారు. మతాన్నీ కవిత్వాన్నీ సమ్మేళించిన మహానుభావులు వారు. వారి గ్రంథాలలో సంకల్ప సూర్యోదయము, హంస సందేశము, రహస్యత్రయ సారము ప్రముఖ స్థానాన్ని వహిస్తున్నాయి.

భారతదేశంలో బయలుదేరిన అనేకోద్యమాల మీద ప్రత్య క్షంగానో పరోక్షంగానో రామానుజుల ప్రభావం పడింది. తెలుగు బ్రాహ్మణులైన నింబార్కులు రామానుజులకి సమకాలీనులే. సౌరభ మన్న పేరుతో వారు వేరే వ్యాఖ్యానం వ్రాసి ఉన్నా ఆయన మీద రామానుజుల ప్రభావం బలంగానే కనిపిస్తుంది. నింబార్కులు అద్వైతం నుండి భిన్నులవుతూ విశిష్టాద్వైతానికి సన్నిహితులయారు.

ద్వైత దర్శన ప్రవర్తకు లయిన మధ్వాచార్యులు రామానుజుల తర్వాత కొద్ది కాలానికే వచ్చారు. వారి వేదాంతంలో రామానుజుల ప్రభావం స్పష్టంగానే కనిపిస్తూ ఉన్నా అపృథక్సిద్ధ విశేషణ (విడదీయరాని గుణం) సిద్ధాంతాన్ని వారు తిరస్కరించారు.

విశ్వానికి బ్రహ్మము ఉపాదాన కారణమన్న వాదాన్ని కూడా వారు అంగీకరించ లేదు. మాయా వాదాన్ని పూర్తిగా వ్యతిరేకించడంలో వారు విశిష్టాద్వైతంతో ఏకీభవించారు.

క్రీ. శ. 14 వ శతాబ్దికి చెందిన రామానందుల మూలంగానే ఉత్తర భారతంలో భక్తి ఉద్యమం బయలుదేరింది. వారూ రామానుజుల వలెనే వైదిక మతంలో మితిమీరిన కర్మ కాండకూ, ఆచారాలకూ ఉన్న ప్రాముఖ్యాన్ని తొలగించారు. వారు శ్రీరామ చంద్రుణ్ణి మూర్తీభవించిన ధర్మంగా-వ్యక్తి ధర్మమూ, గార్హస్థ్య ధర్మమూ, సాంఘిక ధర్మమూ ఏకీభవించిన ఆదర్శమూర్తిగా గణించారు.

వంగ దేశంలో వైష్ణవాన్ని స్థాపించిన శ్రీకృష్ణ చైతన్యులు కృష్ణపరమాత్మ నారాధించిన మహాభక్తులు. వీరివల్లనే కృష్ణ ప్రాణ మతం దేశంలో ఎంతో వ్యాపించింది. మతానికి ప్రాణ భూత మైనది ప్రేమ మాధుర్యమే అని వారి అభిప్రాయం. పరమార్థమూ అస్తిత్వమూ కృష్ణ భావనలో సమన్వితము లవుతున్నాయి. స్వచ్ఛ ప్రేమానుభూతి పొందడానికి రాధాకృష్ణ ప్రేమ భావనను ప్రబోధించిన ఈ సిద్ధాంతంలో రామానుజుల ప్రభావాన్ని గమనించవచ్చు.

జయదేవుడు తన గీత గోవింద గేయ కావ్యంలో ఈ మధురాను భూతిని అమరమొనర్చాడు. ఆళ్వారుల నాయక నాయకీ భావనలోనూ, దాని ఛాయలైన ఉత్తరదేశ వివిధ భావనలలోనూ శారీరిక ప్రేమ నధిగమించి ఈ మధుర భావమే ప్రకాశిస్తుంది.

మహారాష్ట్రానికి చెందిన నామదేవ, ఏకనాథ, తుకారాం, రామదాస ప్రభృతులైన మహాత్ములు ఈ మహోజ్జ్వల భక్తి సంప్రదాయ పరంపరకు చెందినవారే. రామదాసుతో ధార్మిక ప్రజాపాలనకు మతం సహకరింప సాగింది. శివాజీలో శత్రువుల నెదుర్కొనే

ధైర్య స్థైర్యాలను ప్రబోధించి అతనిచేత శాంతియుత ధర్మ రాజ్య స్థాపన చేయించారు.

గురునానక్ స్థాపించిన నీతి ప్రధానమైన సిక్కు మతము ఆచార్యాభిమానానికి అంటే గురుభక్తికి అధిక ప్రాధాన్య మిచ్చిన వైష్ణవమతానికి రూపాంతరమే. సిక్కుల గురువులు పదిమందీ ఈశ్వర ప్రతినిధులవడమేకాక పది ప్రధాన గుణాలకు - వినయము, విధేయత్వము, సమత, సేవ, ఆత్మ త్యాగము, ధార్మికత్వము, దయాళుత్వము, పావిత్ర్యము, శాంతి, సాహసము-అనే వాటికి ప్రతీకలై ఉన్నారు. మానవుడు దైవానికి చెందినట్లే దైవం మానవునకు చెందినవాడు. ఈ పరస్పర బాంధవ్య భావనలో కూడా సిక్కు మతము రామానుజ బోధనలో సాదృశ్యం వహిస్తోంది. వైష్ణవంలోని భాగవత స్వాతంత్ర్యానికీ, సిక్కు మతంలోని ఆధ్యాత్మిక ప్రజాస్వామ్యానికీ ఎంతో సామ్యం ఉన్నది.

ఆధునిక కాలంలో వైష్ణవాచార్యుల మహోపదేశాల వల్ల ప్రభావితులైన మహానుభావులలో గాంధీమహాత్ముణ్ణి ఉత్తమోదాహరణంగా పేర్కోవచ్చు. మరణశయ్యపై ఉండి తమ శిష్యులకు రామానుజు లొనర్చిన ఉపదేశాల సారం యావత్తూ గాంధీ మహాత్ముడభిమానించి, బహుళ ప్రచారం చేసిన నరసీ మెహతా కృతి వైష్ణవజనతో అనే, సుప్రసిద్ధ గేయంలో కనిపిస్తుంది.

ఈ విధంగా రామానుజులు ప్రారంభించిన ఉద్యమం నేటికీ సజీవమై ఆయన తరువాత ఎంతో కాలానికి బయలుదేరిన నైతిక సాంఘిక సంస్కరణోద్యమాల్లో తన ప్రభావాన్ని కనబరుస్తూందనే విషయం విదితమవుతోంది. వైష్ణవ మతం ఇహలోక ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పడమే కాదు, దాన్ని స్వర్గం చెయ్యాలని ప్రయత్నిస్తోంది. హిందూమతం ప్రత్యక్ష ప్రపంచాన్ని నిర్లక్ష్యం చేసే మతమనే స్థూల విమర్శ వైష్ణవంవల్ల నిరాధార మవుతుంది.

విశిష్టాద్వైత దర్శనాన్ని ప్రతిపాదించడంలో రామానుజులు పడిన శ్రమ యావత్తూ నిరాకారమైన నిర్గుణ పరబ్రహ్మ భావనతో పాటు సాకారుడైన ఏకేశ్వరుని అస్తిత్వాన్ని బలపరిచే విధంగా ఉపనిష ద్వాక్యములను సమన్వయించడంలో ఉన్నది. పరమాత్మ ఒక్కడే. ఆయన విశిష్ట గుణ సంపన్నుడు. ఆయనే ఈశ్వరుడు. చిదచిత్ప్రకృతులు ఆయన విశేషణాలు. ఈశ్వరుడు చిద్రూపాల లోనూ, అచిద్రూపాలలోనూ అభివ్యక్తమవుతూ ఉంటాడు. చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే ఈ మూడు తత్త్వాల వైయక్తిక లక్షణాలనూ వాని పరస్పర సంబంధాన్ని అవగాహన చేసు కునేందుకు తోడ్పడేదే జ్ఞానము. ఇవే విశిష్టా ద్వైతంలో తత్త్వ త్రయంగా ప్రఖ్యాతి పొందాయి.

'బ్రహ్మ విదాప్నోతి పర' మని ఉపనిషద్వచనము. బ్రహ్మ వేత్త పరమును పొందును (తైత్తిరీయము). ఇది తత్త్వ, హిత, పురు షార్థములనే త్రైవిధ్యంతో గూడిన వేదాంత విజ్ఞానమే అవుతుంది. బ్రహ్మమే సర్వాస్తిత్వమునకూ నిత్యాధార మన్న పరిజ్ఞానమే తత్త్వము. బ్రహ్మ సాక్షాత్కారానికి అవలంబించవలసిన నైతికా ధ్యాత్మిక సాధనా మార్గమే హితము. ఇక పురుషార్థము బ్రహ్మాను భవమే.

ఈశ్వరుడు దోషాతీతుడు. అద్వితీయ సద్రూపుడతడే. కాంతి మంతమూ, పరమ కోమలమూ, మధురాతి మధురమూ, భవ్యమూ అయిన దివ్య శరీరం కలవాడు. ఈశ్వరు డొక్కడే అనంత దయా సాగరుడని రామానుజుల భావన. ఆయన తన అపార కారుణ్యం వల్లనే అసమగ్రులైన జీవులను ఉద్ధరించి పరిపూర్ణులను చెయ్యడానికి మానవ రూపాన్ని ధరిస్తూ ఉంటాడు. పాపుల నుద్ధరించడానికి

భగవంతు డవతరిస్తున్నాడన్న ఆశలోనే మానవజాతి ఊరట పొందుతోంది. దయా విహీనమైన పక్షంలో భగవంతుని అనంతానే కావతారాలు ఎంత పరిపూర్ణములైనవైనా నిరర్థకమే అవుతాయి.

అచేతన పదార్థాల నడుమనే చైతన్యం ఉంటోంది. అభౌతిక మైన ఆత్మ భౌతిక శరీర సంబంధియై ఉంటూ విశ్వంగా దృశ్య మాన మవుతోంది. చిదచిత్తులు రెండూ ఈశ్వరాధీనములై సహ జీవితం గడుపుతున్నాయి. కేంద్రమైన ఆత్మ ఆ ఈశ్వరుడే; భౌతికమైన విశ్వంలోనూ, సర్వ జీవాత్మల లోనూ అతడే శాశ్వత మూర్తి. ద్రవ్యాత్మలు రెండూ సరి సమంగానే సత్యములు, నిత్య ములు. అవి రెండూ కలిసే ఈశ్వర శరీర మవుతున్నాయి. ఆ ఈశ్వరుడు సర్వాత్మలకూ సర్వ ద్రవ్యమునకూ ఆత్మ అవు తున్నాడు. ఒక రసాల ఫలంలో రంగు, రుచి, వాసన, కండ, పీచు మొదలైనవి దేనికదే విభిన్నమైనా అన్నీ కలిపే పండవు తున్నాయి. ఆ మామిడిపండు ఒక సంపూర్ణ స్వరూపం. అందులోని విభిన్న లక్షణాలు రంగు, రుచి, వాసన మొదలైనవి పండుతో సంబంధం లేకుండా స్వతంత్రంగా ఉండలేవు. అదే విధంగా ఈశ్వరుడు ద్రవ్యాత్మల సమాహార స్వరూపుడై పరమార్థతః అద్వితీయుడయి ఉండీ ఆయన విశేష లక్షణాలయిన ద్రవ్యాత్మలపై సర్వాధికారి అవుతున్నాడు. సారభూతమైన తత్త్వమూ ఈశ్వరుడే. ఒక విధంగా విశిష్టా ద్వైతాన్ని విశేషణ యుక్తమైన అద్వైతమనీ, విశిష్ట పరిపూర్ణత్వం తోడి అద్వైతమనీ చెప్పవచ్చు.

జీవాత్మ అచిత్తు కంటె భిన్నమూ, దాని కతీతమైనదీ అయినా అది భౌతిక శరీరంలోనే ఉంటోంది. అందుచేత ఈ రెంటి సాహచర్యం ఒకవంక శారీరకంగానూ మరొకవంక ఆధ్యాత్మికంగానూ పరిశీలిస్తేనే గాని అవగాహనకాదు. శరీరం బ్రతుకుతోంది, గాలి పీలుస్తోంది, కదుల్తోంది. అంతేకాదు ఆలోచి స్తోంది, అనుభవిస్తోంది, ప్రవర్తిస్తోంది. నిజానికి దాని ప్రవర్తనలో

ఇతర చేతనులతోనూ అచేతన పదార్థాలతోనూ సంబంధాన్ని ఏర్పరుచుకోవడానికి చేసే ప్రయత్నం కనిపిస్తుంది. దీన్నే మన మీ జగత్తులో జీవిత మంటున్నాము. శరీరంలేని ఆత్మ రెక్కలు లేని పక్షి వంటిదై ఏమీ చెయ్యలేదు. భౌతిక జీవితం వల్ల ఆత్మ పరిపూర్ణత్వాన్ని పొందుతోంది. పక్షి ఎగురుతూ పాడేటట్లు 'ఈ సృష్టిలోని మంచి అంతా మనదే. ఆత్మవల్ల శరీరమూ, శరీరంవల్ల ఆత్మా ఉపకారం పొందుతున్నాయి' అని గానం చేద్దాము.

ఆత్మకు శరీరంతోడి సాహచర్యం అవసరమే అయినా ఆ రెంటినీ ఒకదాన్నొకటిగా భ్రమించగూడదు. ఆత్మ శరీరాన్ని అధిగమించాలి. శరీర సాహచర్యంతోనే తృప్తిపడి ఊరుకుంటే పొందవలసిన ఔన్నత్యాన్ని పొందలేదు. భౌతిక విషయ లోల మైన జీవాత్మ అహంకారాన్ని పెంచుకుని తనకు ఈశ్వరునితో నిమిత్తం లేని స్వతంత్రమైన అస్తిత్వం ఉన్నదని ఇంద్రియ సుఖాలలో మునిగిపోతుంది.

జీవాత్మ సాధించవలసిన ఉన్నత లక్ష్యం ఈశ్వరుని తోడి సాహచర్యం. శరీరంలోని జీవాత్మ ఈశ్వరుణ్ణి చెందడానికి నిర్విరామంగా కృషి చేయాలి. మానవుని కరచరణాద్యవయ వములన్నీ ఈశ్వర సేవ కొరకే ఏర్పడినాయి. ఆ ఈశ్వర సేవ తోడి జీవులకు సేవచేయడం ద్వారానే సాధ్యమవుతుంది. ఈ విధంగా శరీరం ఈశ్వరుణ్ణి చేరుకోవడానికి సాధనమవు తోంది. అందుచేత బంధ మోక్షాలు రెంటికీ శరీరమే హేతువు. అయితే దాన్ని దేనికుపయోగించుకోవడమన్నది మానవుని అభీష్టం మీద ఆధారపడి ఉంటుంది. ఈ జీవితంలో తన కిష్ట మైన మార్గాన్ని ఎన్నుకునే స్వాతంత్ర్యం మానవునకున్నది. అయితే తన ప్రవర్తనకు తాను నైతికంగా బాధ్యత వహించక తప్పదు.

జీవాత్మ తన భాగ్యానికి తానే విధాత అన్న విషయాన్నే కర్మ సిద్ధాంతం ఉద్ఘాటిస్తోంది. విత్తిన పంటనే మానవు డనుభవిస్తాడు. తన కిష్టమైన దాన్ని తాను విత్తుకునే స్వాతంత్ర్యం మానవునకున్న దని కర్మ సిద్ధాంతం బలపరుస్తోంది. దీన్ని బట్టి కర్మ సర్వ శక్తి మంతమనీ న్యాయాన్ని గూడా అధిగమించి శాశ్వతంగా తన అధికారాన్ని చలాయించగలదనీ అనుకోకూడదు. జీవుడు మోక్షార్థియై నిరంతర పాపాచరణ ప్రలోభాన్ని పూర్తిగా వదులుకొని ఈశ్వరునకు ప్రసన్నుడు కాగలిగిన నాడు కర్మ అతని నేమీ చెయ్యలేదు. ఈశ్వరుడు సర్వ రక్షకుడు. మానవుడు విచక్షణ పరుడై తన స్వాతంత్ర్యాన్ని వినియోగించుకుని ఈశ్వరునకు సర్వాత్మనా స్వాధీనమయ్యే మార్గాన్ని అవలంబించినప్పుడు ముక్తి నవలీలగా పొందగలడు.

మానవుడు బాల్య యౌవన కౌమార వార్ధక్యములనే నాలుగు దశలనూ అధిగమించాలి. ప్రతి దశలోనూ తాను నిర్వర్తించవలసిన విధులూ, అధిగమించవలసిన అపాయాలూ అనేకం ఉంటాయి. వీటన్నింటిలోనూ మానవునకు ధర్మాన్ని సమర్థిస్తూ స్వాతంత్ర్యాన్ని అనుగ్రహించే ఈశ్వరుని తలపోయటం వల్ల సుఖ శాంతులు లభిస్తున్నాయి. కర్మాచరణలోనే కాక కర్మ ఫలానుభవంలో గూడా మానవుడు స్వాతంత్ర్యాన్ని వాంఛిస్తున్నాడు. అట్టి సమగ్ర సార్థక స్వాతంత్ర్యమే మోక్షం. జీవునకు నిత్య రక్షకుడూ అంతిమ శరణ్యుడూ ఈశ్వరుడే! జీవుడు ఈశ్వరుణ్ణి గుర్తించి ఆయనను ప్రార్థించాలే గాని జీవ ప్రార్థన ననుగ్రహించేందుకు ఈశ్వరుడెల్లప్పుడూ సిద్ధమయ్యే ఉంటాడు.

ఈ విషయాన్ని నిరూపించేందుకు రామానుజులొక కథ చెప్పేవారు. ఒకానొక రాజకుమారుడు రాజసౌధం విడిచి తప్పిపోయాడు. ఒక బ్రాహ్మణుడు ఆ పిల్లవాడి కాశ్రయమిచ్చి తనకున్న దానితోనే నిరాడంబరంగా పెంచాడు. పదహారేళ్ల

వచ్చాక నీ తండ్రి ఫలానా దేశాన్ని పాలించే రాజనీ, ఆయన కెంతో ఐశ్వర్యమూ అధికారమూ ఉన్నాయనీ ఆ కుర్రవాడి కెవరో చెప్పారు. ఈ సమాచారం తెలియగానే ఆనందించి అతడు తండ్రి దగ్గరకు వెళ్లితే ఆయన అతన్ని ప్రేమాదరాలతో స్వీకరించాడు. తండ్రి కొడుకు లిద్దరూ తిరిగి కలిశారు.

రాజకుమారుని వంటి దారి తప్పిన జీవాత్మకు బ్రాహ్మణుని వంటి ఉత్తమ సంఘం అభయ మిచ్చి తగిన శిక్షణలో పెంచగా అతడు తాత్కాలికంగా పరిచి దూరంగా ఉన్న పితృరూపిమైన పరమాత్మను చేరుకునే మార్గాన్ని యోగ్యమైన సమయంలో గురువు చూపిస్తున్నాడు.

శరీరం పరిణామం చెందుతూ వినాశన మవుతోంది. దానికి జనన మరణాలున్నాయి. కాని ఆత్మ నిత్యమైనది. జననమంటే శరీరంతో కలయిక, మరణమంటే దానినుంచి వియోగం.

మానవుడు జ్ఞాతగా, కర్తగా, అనుభోక్తగా వ్యవహరిస్తున్నాడు. ఆయా కర్మల ద్వారా తన్ను తాను అభివ్యక్తం చేసుకుంటున్న చైతన్యం అతనికున్నది. మంచి చెడ్డలలో దేనిని చెయ్యడానికైనా అతనికి స్వాతంత్ర్యం ఉన్నది. ఈశ్వరుడు అతనికా స్వాతంత్ర్యం ఇచ్చాడు. పరిపూర్ణత్వ గమ్యాన్ని చేరుకునే మార్గం కష్టం కావడం మానవుడు తన స్వాతంత్ర్యాన్ని సద్వినియోగం చేసుకో లేకపోవడం వల్లనే.

జీవితంలో తటస్థపడే కష్టాలన్నీ, సర్వమూ ఈశ్వరాధీనమయి ఉన్నందువల్ల, భగవదభీష్టాని కనుగుణంగా తనను తాను మలుచుకోవడంలోనే తన స్వాతంత్ర్యమూ భద్రతా ఉన్నాయని మానవుడు గుర్తించేందుకు తోడ్పడుతాయి. ఈశ్వరునకు విధేయుడై ఉండేవానికి అన్నీ విధేయమవుతాయి. నీడ నిచ్చి, ఫల పుష్పాల నిచ్చి అందరికీ ఉపయోగపడే వృక్షంవలె మానవుడు ఇతరులకొరకు బ్రతకడంలో తృప్తిని పొందడం నేర్చుకోవాలి.

వైష్ణవుడుపదేశం పొందే 'ఓం నమో నారాయణాయ' అనే అష్టాక్షరీ మంత్రం తాను తనకొరకు కాక ఈశ్వరుని కొరకే జీవించాలని అతని కెల్లప్పుడూ జ్ఞాపకం చేస్తూ ఉంటుంది. ఈశ్వర శబ్దం పూజా నమస్కారాలతో ఆరాధ్యుడైన సూర్య నారాయణ స్వామి నుండి సేవా పరిచర్యాదులతో అర్పింపదగిన దరిద్ర నారాయణుని వరకు విశ్వంలో సమస్తాన్నీ తనలో అంతర్భూతం చేసుకుంటోంది.

జీవులు మూడు విధాలుగా ఉంటున్నారు. కొందరు బద్ధులు. కొందరు ముక్తులు. మరికొందరు నిత్యముక్తులు. బద్ధ జీవులకు ముక్తిపొందే అవకాశం ఉన్నా దాన్ని వారు గుర్తించడం లేదు. ఈ అజ్ఞానమే భ్రాంతికి హేతువవుతోంది. వారు శరీరాన్ని ఆత్మగా భ్రమిస్తున్నారు. తిలలలో తైలమూ, దారువులో అగ్ని గర్భితమై ఉన్నాయి. గానుగాడితే తిలల నుండి తైలం వస్తుంది. మధిస్తే దారువు నుండి అగ్ని వెలువడుతుంది. అదే విధంగా జీవుడు విముక్తి నందే స్వసామర్థ్యాన్ని వినియోగించుకునేందుకు ఆధ్యాత్మికంగా కృషి చేయాలి. జ్ఞానమటువంటి వివేకాన్ని కలిగిస్తుంది. ఆ జ్ఞానమే పరిపక్వమై భక్తిగా పరిణమించినపుడు అంతకంటె ఉన్నత కక్ష్య నందుకుంటాడు. భక్తి హార్దికమైనది. అది పరాకాష్ఠ నంది పరమార్థానుభవ దశ నందినప్పుడు దానికి మరొక గమ్యం ఉండదు. స్వయం ఫలరూపమై ఉంటుంది. రామానుజులీ భక్తి దర్శన ప్రతిపాదనకు అవసరమైన ప్రబోధాన్ని మహా భక్తులైన దక్షిణదేశ ఆళ్వారుల భక్తి భరిత గేయాల నుండీ, వారి అనుభవాల నుండీ పొందారు. రామానుజుల గొప్పతనం భక్త్యావేశాన్నీ ఆళ్వారుల అంతర్దృష్టినీ సమన్వయించి సంస్కృతంలో తమకున్న అపార పాండిత్యం చేత సతార్కికమైన వేదాంత దృక్పథంగా ప్రతిపాదించ గలగడంలో ఉన్నది.

ఈశ్వరార్చన కనేక మార్గాలున్నాయి. అన్నింటి కంటే

సులభమూ ఫలవంతమూ అయిన మార్గం ప్రపత్తి. అంటే నిర్నిబంధంగా ఈశ్వరునకు స్వాధీనమై పోవడమే. మోక్ష ప్రదాన భారం ఈశ్వరునిపై మోపి ప్రపన్నుడు నిశ్చింతుడై సుఖ శాంతులతో అతడు జీవితాన్ని గడుపుతాడు. ఈశ్వర సంతానమైన జీవకోటికి సేవ చేయడమే అతని వృత్తి. అది ఈశ్వరార్చనమే కాబట్టి దాని కెట్టి ప్రతిఫలమూ అవసరము లేదు. అహింస, ఆత్మ నిగ్రహము, దయ, క్షమ, శాంతి, నిరాడంబరత్వము, పరమార్థ జ్ఞానము, సత్యాచారము - అనే ఎనిమిది "పువ్వులు" ఈశ్వరునకు మిక్కిలి ప్రియమైనవి.

కైంకర్యమే అంటే భగవద్భక్తులకు పరిచర్య చేయడమే జీవితానికి లక్ష్యం. మోక్ష మీ కైంకర్యంలోనే ఉన్నది. ఈశ్వరుడు మనలో ఉన్నాడు. జీవులందరిలోనూ ఉన్నాడు. ఇతరులకై జీవించడమే జీవితంలో పొందదగిన పరమానందం. మనలో ఈశ్వరుడున్నట్లయితే అతనికి వాస యోగ్యంగా మన శరీరాన్ని ఆత్మనూ పరిశుద్ధం చేసుకోవాలి. భగవదర్థమై జీవించాలన్నదే జీవితాన్ని నిజంగా నడిపే శక్తి. ఈ పరమార్థాన్ని అందుకునేందుకే మనకు జన్మ లభించింది. ఇక్కడ - ఇప్పుడు - ఈశ్వర సన్నిధాన వర్తులమై జీవించే నైపుణ్యమే ఉంటే స్వర్గం కంటె భూతలమే ఉత్తమమైనది. ఈ భూలోకంలో యోగ నిద్రా ముద్రితుడైన శ్రీమన్నారాయణునితో జీవించడం నేర్చిన యథార్థ భక్తునకు స్వర్గమోహమే ఉండదని ఉద్ఘాటించే తొండరడిప్పొడియాళ్వారుల దివ్య ప్రబంధాన్ని రామానుజు లెప్పుడూ ఉదహరిస్తూ ఉండే వారు. మహావిష్ణు నివాసమయిన వైకుంఠానికి తిరుపతి ఏ విధంగానూ తక్కువకాదు. ఈ విషయాన్ని విస్పష్టం చెయ్యడానికి రామానుజులు మూడు గద్యలు చెప్పారు. అవి శరణాగతి గద్య, శ్రీరంగ గద్య, వైకుంఠ గద్య.

సత్త్వ రజస్తమస్సులనే త్రిగుణములకూ ఆధార భూమికయే

ప్రకృతి. ఈశ్వరుని శరీర స్వరూపాలు ప్రకృతి మయాలే. విశ్వం ప్రకృతి వల్లనే జనించి ఈశ్వరేచ్ఛకు అధీనమై ఉన్నది. ద్రవ్య రూపాల పరస్పర సంబంధాన్ని అపృథక్సిద్ధమని (విడదీయరానిది) చెబుతారు. బ్రహ్మముతో అచిత్తునకూ చిత్తునకూగల సంబంధాన్ని శరీరశరీర భావం (శరీరాత్మల సంబంధం) గానూ, విశేషణం విశేష్య భావం (గుణద్రవ్య సంబంధం) గానూ, శేషశేషి భావ (సేవ్య సేవక సంబంధం) గానూ, అంశాంశి భావం (భాగ పూర్ణ సంబంధం) గానూ, ఆధారాధేయ భావం (ధృత పాత్రసంబంధం) గానూ, నియంతృ నియమ్య భావం (పాలక పాల్య సంబంధం) గానూ, రక్షక రక్ష్య భావం (పితా పుత్ర సంబంధం) గానూ రామానుజులు వివర్ణించారు.

చిత్తున కధీనమై ఉండి దాని ప్రయోజనానికి ఉపయోగపడే ద్రవ్యమే శరీరము. అది అనిత్య మవడంచేత చిత్తుకంటె భిన్న మైనది. అచిత్తునకు చైతన్యం లేదు. చిత్తు చేతనాసహితం, అచిత్తు నుండి స్వతంత్రమైనది. చిదచిత్తులు రెండూ ఈశ్వర శరీరమయి ఆయన స్వప్రయోజనం కొరకు ఆయన కధీనములై ఉంటున్నాయి. ఈశ్వరుని కొక్కనికే సత్త ఉన్నది. చేతనా చేతన పదార్థములన్నీ ఆయన విశేషణములు. దీనినే విశేషణ విశేష్య భావమనీ ప్రాకార ప్రాకారీ భావమనీ వ్యవహరిస్తారు. విశ్వ పదార్థ సర్వస్వం బ్రహ్మమునకు శరీరమవడంచేత దాని యాత్మ బ్రహ్మమునందే ఉన్నది. జీవాత్మలకూ ద్రవ్యమునకూ బ్రహ్మముతో గల సంబంధాన్ని రామానుజులు మూడు రంగుల గుడ్డ ముక్కతో పోల్చారు. ఉపాదాన కారణం తెలుపు, ఎరుపు, నలుపు మొదలైన మూడు రంగుల నూలు పోగుల వంటిది. కాని అవన్నీ ఒకానొక నిర్దిష్ట స్థలంలో ఒకే ఒక రంగు- ఉదాహరణకు తెలుపు-కలవై ఉంటాయి. ఇక్కడ వ్యక్తిత్వమూ వైలక్షణ్యమూ నశించే ప్రమాదమేమీ లేదు. ఈశ్వరుడే జగత్తునకు ఉపాదాన

కారణము. చేతనా చేతన పదార్థములన్నీ దానియందలి వేరు వేరు పోగులు. అవి వేటికవిగా ఉండగలవు.

ఈశ్వరుడు తన్నుతాను ఐదు రూపాలలో మూర్తీభవిస్తున్నాడు. అవి పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతార మూర్తులు. పరావిష్కృతి సర్వోత్తమమైనది. ఆ దశలో ఈశ్వరుడు పరబ్రహ్మముగా లేదా శ్రీమన్నారాయణుడుగా నిత్య విభూతి నిలయమైన పరంధామంలో ఉంటాడు. రెండవదైన వ్యూహావిష్కృతి నాలుగు విధాలుగా ఉంటుంది. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధ వ్యూహములు భక్తార్చన కొరకై ఆవిష్కృతము లవుతున్నాయి. మూడవదైన విభవా విష్కృతిలో ఈశ్వరుడు తనంతట తాను అనేకావతారములు ధరిస్తున్నాడు. దేహధారుల హృదయ ప్రదేశాల్లో అంతర్యామి రూపంలో ఆవిష్కృతి నందడమే నాలుగవది. ఆలయాలలో ప్రతిష్ఠితములైన విగ్రహాల్లో విరాజిల్లుతున్న అర్చా రూపమే అంతిమమైనది.

శేష శేషి భావం ఈశ్వరుణ్ణి ప్రభువూ యజమానీ అన్నట్లుగానూ జీవాత్మను బానిస లేక సేవకుడన్నట్లుగానూ చెపుతుంది. తెలివి తక్కువతనంచేత కొంతకాల మా విషయాన్ని విస్మరించినప్పటికీ మనం సంపూర్ణంగా ఈశ్వరుని పైననే ఆధారపడి ఉన్నాము.

బ్రహ్మము పూర్ణము. జీవాత్మ దానియందలి భాగం. బ్రహ్మము పరంజ్యోతి. ఈ జగత్తునందలి జీవులూ పదార్థాలూ ఆ జ్యోతి వెలుగులే.

ఏదినిలవడానికైనా భూమి ఆధారమైనట్లే బ్రహ్మము సర్వాధారము. ఇదే ఆధారాధేయ సంబంధము. అచేతన ద్రవ్యాన్ని దాని సూక్ష్మ దశలో ప్రకృతి అంటారు. దీనితో జీవాన్ని మేళవించి ఈశ్వరుడు విశ్వాన్ని సృజిస్తున్నాడు.

జగత్తునకు స్థితి బ్రహ్మము నందే ఉన్నది. ఆ బ్రహ్మము

నుండే ఆవిర్భవిస్తున్నది. ఆ జగత్తులో బ్రహ్మము అంతరాత్మ రూపియై ఉండి ప్రకృతినీ జీవాత్మలనూ పాలిస్తున్నాడు. ఇది బ్రహ్మమును నియంతగా నిరూపిస్తున్నది.

ఈశ్వరుడు రక్షకుడు. జీవాత్మలు రక్ష్యములు. ఈశ్వరుడే సర్వ జీవాత్మలకూ రక్షకుడు. దివ్య గుణాలయిన సౌలభ్య సౌశీల్యాలు అతనికున్నాయి. ఈశ్వరుడు అపారమైన తన దయ వల్లనే మానవజాతిలో అవతరించి ఆ మానవునితో పాటు కష్టపడి తన మార్గదర్శకత్వంలో తననే ఆదర్శంగా చూపి మానవుని ఔన్నత్యానికి దోహదం చేస్తున్నాడు.

ద్రవ్యరూప చైతన్యం కంటె భిన్నంగా గుణాత్మక చైతన్యం వేరే ఉన్నదని చెప్పే ధర్మభూత జ్ఞాన సిద్ధాంతాన్ని రామానుజులు ప్రతిపాదించారు. ఇది ఆత్మవాద వాస్తవ వాదాల వలని దోషాలను పరిహరించడానికి సహాయపడుతోంది. బాహ్య వస్తువులకూ, వాని అన్యోన్య సంబంధములకూ చెందిన పరిజ్ఞానమే వాస్తవవాదము. ఆత్మవాదము సమస్తాన్నీ భావోద్భవంగా పరిగణిస్తుంది. వస్తువులకూ భావములకూ నడుమ నెంతో వ్యవధానాన్ని వాస్తవవాదం సహిస్తూ ఉండగా ఆత్మవాదమలా కాక కేవలమాత్మాశ్రయమై ఉంటుంది. ధర్మ భూతజ్ఞానము చిదచిత్తులకూ, ఆత్మకూ వస్తువులకూ గల సంబంధము నందలి వాస్తవికతను నిరూపిస్తుంది. పరమమైన బ్రహ్మమునందు చిదచిత్తులు రెండూ ఉన్నాయి. అవి నిత్యములై ఉంటూ బ్రహ్మమునకు బాహ్యంగా లేవు. ధర్మభూతజ్ఞానము వస్తుతత్త్వ యథార్థ పరిజ్ఞానమే. అది స్వయం ప్రకాశము, బ్రహ్మమును దర్శింపజేసే సామర్థ్యం కలది. కర్మవలన ఏర్పడే పరిమితులకు ఒదిగి ఉంటూనే ఈ ధర్మ భూత జ్ఞానం సర్వ ప్రతిబంధకాలనూ అధిగమించి స్వచ్ఛ పరిపక్వ స్థితిలో పరమార్థమైన బ్రహ్మ సాక్షాత్కారానికి సాధనం కాగలదు. పరిచ్ఛిన్నములైన సర్వ

పదార్థాలకూ అతీతమైన భగవత్సాక్షాత్కారానికి అవసరమైన నిరవధిక చైతన్యంగా సావధిక విజ్ఞానమే విస్తరిస్తోంది.

రామానుజుల వాదం ప్రకారం నిర్గుణమైన కేవల వస్తుజ్ఞానం సాధ్యమే కాదు. నిర్గుణమై నిరవయవమయిన బ్రహ్మాన్ని ఆయన ఎన్నడూ అంగీకరించలేదు. 'నేతి, నేతి' (ఇది కాదు, ఇది కాదు) అంటూ వ్యతిరేక ముఖంగా ఉపనిషత్తులు చేసే ప్రతిపాదనలో గూడా అవి కొన్ని విశేషణాలను కాదంటున్నాయే కాని అసలు ఏ విశేషణాలూ లేవనడం వాటి తాత్పర్యం కాదని రామానుజుల అభిప్రాయం.

రామానుజుల దృష్టిలో జ్ఞానమంటే యదార్థ స్థితి యొక్క సమగ్రమైన సంపూర్ణమైన అవగాహనమే. అపరిపూర్ణ జ్ఞానమే దోషం. కొరకంచును గిరాగిరా త్రిప్పినప్పుడు వర్తులాకారంగా వెలుగు కనిపిస్తుంది. కొరకంచు తన వర్తుల మార్గంలో ప్రతి బిందువునూ స్పృశిస్తూనే ఉన్నా పరిభ్రమణ వేగంవల్ల వ్యవధానాలను గుర్తించలేక పోతున్నాము. అలాగే సంసారంలో మనం సత్యాన్ని పాక్షికంగానే తెలుసుకోగలుగుతున్నాము. ఆ పాక్షిక జ్ఞానమే ధర్మభూత మైనప్పుడు పెరిగి పెరిగి విస్తృతమైన స్థితిలో సంపూర్ణ సత్యాన్ని తెలుపుతోంది. రామానుజులు జ్ఞాన జనక సాధనాలుగా ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాలను మూటిని మాత్రమే అంగీకరించారు.

వైష్ణవ ధర్మం నైతికంగా భగవంతున కాత్మార్పణం చేసుకోమని గట్టిగా ఉద్బోధిస్తున్నది. ఆధ్యాత్మికంగా భగవంతుణ్ణి అనంత ప్రేమ మూర్తిగా చిత్రిస్తోంది. భక్తి అంటే భగవంతునితో ఐక్యం చెందాలనే తహ తహయే. జీవుని గమ్యస్థానం దైవమే. సంసార చక్రంలో బంధింపబడి తాను దైవము నుండి విడదీయ బడినట్లు జీవుడు వేదనచెందుతూ ఉంటాడు. ఆధ్యాత్మికంగా ప్రబోధం చెందినప్పుడు ఈశ్వరునిలో ఐక్యం చెందేవరకూ జీవు

నకు తృప్తి ఉండదు. భగవద్వియోగం దుస్సహమయి దేశకాల బద్ధమయిన తుచ్ఛ శరీర ధారణం నిరర్థక మనిపిస్తుంది. సర్వ విధాలా పరిశుద్ధుడై భగవదుపాసనతో తన్మయుడైన సాధకుని జీవాత్మలో ఈశ్వరుడు ప్రవేశించి స్థిరనివాసం ఏర్పరచుకుంటాడు. ఇదే భక్తుని దివ్యానుభూతి అన్నమాట. ముక్తి అంటే కేవల బ్రహ్మ సాక్షాత్కారమే కాదు, పరమపదాన్ని పొందడం. అది దేశ కాలాల కతీతమైన దివ్యానుభూతి. జీవుడు ఈశ్వరునితో తాదాత్మ్యం చెందినప్పుడు అతనికి వ్యష్టిభావం నశించి సమిష్టిగా సర్వ ప్రపంచ క్షేమాన్ని కాంక్షించే పిపాస అధికాధిక మవుతుంది. ఈ విధంగా వైష్ణవుని ఆధ్యాత్మికానుభవం లోక శ్రేయస్కరమైనది.

రామానుజులు ఈశ్వరుణ్ణి నిత్యసుందరమూర్తిగా భావించారు. భగవంతుడు ప్రకృతికీ, దాని గుణాలకూ అతీతుడే అయినప్పటికీ జీవాత్మలను తన వైపున కాకర్షించేందుకు ఈ భౌతిక జగత్తులో అనంత సౌందర్యంతో ఆవిర్భవిస్తూ ఉంటాడు. ఈ విశ్వమంతా ఆ చిన్మయ స్వరూపుని దివ్య ప్రభావంతో నిబిడమై ఉన్నది. దేశ కాలాత్మకమైన ఈ జగత్తు ఆయనకు క్రీడారంగం. స్వామికి ఈ లీలలో జీవులతో క్రీడించడం ఒక విలాసం. బ్రహ్మమును గూర్చిన రామానుజుల రసాత్మక భావనకిది సారాంశం.

విశిష్టాద్వైత దర్శనం ఆచరణ యోగ్యమై అనుభవాన్ని అందించే వేదాంత దృక్పథం. అది కేవలం ఊహాకల్పితమైన సిద్ధాంత ప్రతిపాదన కాదు. హేతువాదంవల్లా అనుష్ఠానం వల్లా సుపరీక్షితమై ఈశ్వరానుగ్రహ లభ్యములైన అనుభూతి స్ఫురణ లతో ఆ రెంటికీ అతీతమవుతోంది. కులమత వర్ణాదులతో నిమిత్తం లేకుండా అందరూ మోక్షాని కర్హులని చెపుతుంది. పరిచ్ఛిన్న జీవుల గమ్యస్థానం 'సత్యం, శివం, సుందరం' అని అభివర్ణితమైన పరమాత్మగా ప్రతిపాదించి, ఆ గమ్యాన్ని చేరుకునేందుకు స్పష్టమై, ఆకర్షకమై ప్రపంచాన్ని పవిత్ర మొనర్చే చక్కని రాజ

మార్గాన్ని చూపే వైష్ణవ ధర్మం వల్ల మానవ జీవితం యోగ్యమూ, సార్థకమూ అవుతోంది.

ధర్మాచరణకు జీవుల నుత్తేజ పరిచే ఆధ్యాత్మిక ప్రాతిపదికను వైష్ణవం అందింపగలుగుతోంది. ధర్మాధార ప్రభుత్వానికి ప్రతీకగా రామ రాజ్యాన్ని భావించడంలో ఇది విస్పష్ట మవుతోంది.

# శ్రీ రామానుజ సూక్తులు

1. 'అథా ఽ తో బ్రహ్మ జిజ్ఞాసా - అనంతరము అందుచేత బ్రహ్మమును గూర్చిన విచారణ కర్తవ్య మగుచున్నది. ఇచ్చట బ్రహ్మ శబ్దము స్వభావ సిద్ధంగా సర్వదోష విరహితుడై అనంత కల్యాణ సర్వోత్తమ దివ్య గుణ శోభితుడైన పురుషోత్తమునే సూచిస్తున్నది.'
2. 'జ్ఞాతు మిచ్ఛా జిజ్ఞాసా - జిజ్ఞాస అంటే తెలిసికొనవలెననే కోరిక. ప్రతి కోరికకూ లక్ష్యంగా కోరబడే వస్తువు ఉంటున్నట్లే ఇచ్చట జ్ఞాన వాంఛకు లక్ష్యమైన బ్రహ్మమే అనుభావ్య మవుతోంది. శ్రవణము (వినికి,) మననము (ఆలోచన), నిధి ధ్యాసనము (సుస్థిర భావన) వేద వాక్యావగాహనమునకు ఉపయోగపడతాయి.'
3. 'అవిచ్ఛిన్న తైలధార వలె అనుస్యూతంగా నిర్విరామంగా కొనసాగే స్మృతి ప్రవాహమే ధ్యానము. స్మృతి ప్రత్యక్ష గ్రహణం వంటిదే, ఇంద్రియముల ద్వారా మనస్సు గ్రహించిన దానికి తుల్యమే అవడం చేత.'
4. 'స్థూల దృష్టికి కనిపించిన దాధారంగా ఏర్పడిన భావం పదార్థాల యథార్థ పరిజ్ఞానం వల విపర్యాసం పొందితే ఆ మొదటి భావాన్ని అసత్య మంటారు. ఉదాహరణకు త్రాడును చూచి పామను కోవడం. ఆధార వస్తువు త్రాడై యుండగా దాన్ని చూసి పామని భ్రమించడం తటస్థిస్తోంది. నిజంగా లేని పామును అక్కడ త్రాడులో ఉన్నట్లుగా భావించడం – దేవతలు, మానవులు, జంతువులు, చరాచరములు ఇత్యాది అనేక భేదాలతో కూడిన ఈ ప్రపంచంలో – మనల నందరినీ తప్పుదారిని నడిపించే

ఒకానొక దోషం వల్ల జరుగుతోంది. అది అవిద్యయనీ, ఆ మాయ పరిశుద్ధ చిత్స్వరూపమైన పరమోన్నత బ్రహ్మములో ఉన్నదనీ, బ్రహ్మమును గూర్చిన యథార్థ జ్ఞానం వల్ల అవిద్య పరాఘాత మవుతుందనీ అందుచేతనే అది అసత్య లక్షణం కలదనీ ప్రతిపాదిస్తున్నారు. ఏ గుణాలూ లేని వస్తువొకటి ఉన్నదని ప్రతిపాదించే వారు అట్టి గుణ రహిత వస్తు వున్నదని ఎలా రుజువవుతోందో నిరూపించ లేరు. ఎందుచేత నంటే సత్యాది లక్షణా లేవయినా గుణ సహిత మయిన దానికే వర్తిస్తాయి. నిర్గుణ మైన పరమాత్మ ఉన్నదనడానికి అనుభవమే ప్రమాణమని చెప్పేవారి వాదం (పరమాత్మ ఆత్మకు అనుభవైక వేద్యమవుతోంది) తక్కిన వస్తువుల అనుభవం దృష్ట్యా చూస్తే - ఉదాహరణకు నేను దీన్ని చూదాను అన్నప్పుడు, గుణ సహితమైన వస్త్వనుభవమే అవుతున్నందువల్ల — నిలవడం లేదు. ఒకవేళ నిజానికా వస్తువునకు కొన్ని గుణాలు ఉన్నా అనుభవ కాలంలో అది నిర్గుణంగానే తోస్తోందనీ, దీన్ని నిరూపించడానికి అనుభవానికతీతమైన ప్రత్యేక తర్క మవసరమనీ అనే పక్షంలో అట్టి నిరూపణం ఆ వస్తు తత్త్వానికిభిన్నమై ఆ అనుభవానికి చెందిన కొన్ని విశిష్టలక్షణాల సహాయంతోనే జరగవలసి ఉంటుంది. అందుచేత అది గుణ సహితమై ఉండీ దానియందే నిహితమైన కొన్ని లక్షణాల చేత అది నిర్గుణంగా తోస్తోందని అట్టి నిరూపణ చేత రుజువయినా ఏవో కొన్ని గుణాలు మాత్రమే అనుభవంలో తెలియడం లేదు గాని ఆ వస్తువున కసలేగుణాలు లేవనడానికి వీలులేదు కాబట్టి నిర్గుణ మైన వస్తు వున్నదనడానికి ఏ రుజువూ లేదు.'

౫. 'మంకెన పువ్వు చిక్కని ఎర్ర రంగుచేత ప్రభావితమై దాని పక్కనున్న స్ఫటికం గూడా ఎర్రగానే కనిపిస్తుంది. ఆ

పువ్వు తీవ్ర వర్ణం అన్ని వైపులకూ ప్రసరిస్తూనే ఉన్నా పరిశుద్ధమైన పదార్థంలోనే ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.'

6. 'అద్దంలోనూ, అటువంటి ఇతర పదార్థాలలోనూ తోచే ప్రతిబింబ దర్శనం కూడా సత్యం మీదనే ఆధారపడి ఉన్నది. కంటి నుండి ప్రసరించే కాంతికిరణాలు ప్రతిఫలన యోగ్యమైన పదార్థం వరకూ వెళ్లి ఆగి అటునుంచి పరావర్తనం చెంది ఎదుటనున్న ముఖాది బింబాలను ప్రతిఫలిస్తున్నాయి. ఈ ప్రక్రియ అతి వేగంగా జరుగుతున్నందు వల్ల ఈ ఒక్క సందర్భంలోనే అద్దానికీ ప్రతిబింబానికీ నడుమ నుండే దేశ వ్యవధానం ద్యోతమానం కావడం లేదు. దిగ్భ్రాంతి కూడా ఇటువంటిదే. మనమున్న దేశ ప్రాంతాలకు చెందని విషయాలు అక్కడ ఉన్నట్లు ఏదో అదృశ్య హేతువు ద్వారా దృశ్యమాన మవుతాయి. అందు చేత ఒకానొక దేశ ప్రాంతాన్ని మరొక దేశ ప్రాంతంగా భ్రమించడం గూడా సత్యం మీదనే ఆధారపడి ఉన్నది.'

7. 'స్వభావ సిద్ధంగా సర్వమంగళ స్వరూపుడై పరమానంద మయుడైన పురుషోత్తముడున్నాడు. ఆయన సర్వ దోషాలకూ తత్త్వతః వ్యతిరేకి. ఈ ప్రపంచ సృష్టి స్థితి సంహారాలకు ఆయనే కారణం. సర్వ పదార్థాలకూ భిన్న మయిన స్వభావ మాయనది. ఆయన సర్వజ్ఞుడు. సంకల్ప మాత్రం చేతనే అనుకున్నదంతా సిద్ధింప చేసుకోగలవాడు. తనమీద ఆధారపడే వారికోసమూ అన్నట్లు ఆయన అనంత దయా సముద్రుడు. మూర్తీ భవించిన కారుణ్యమే ఆయన. మన కిట్టి పురుషోత్తము డున్నాడని శ్రుతులు స్పష్టంగా తెలుపుతున్నాయి.'

8. 'నీ వా సర్వేశ్వరుణ్ణి శరణు పొందు. ఆయన దయా ప్రభావం వల్ల నీ ఆత్మ ప్రఫుల్లమవుతుంది. ఆయన దేవాది

దేవుడు. నీ కత్యంత ప్రియమైన ప్రభువు. నీ వాయసను ప్రేమించిన కొద్దీ నీ కాయన దివ్యదర్శనం మరింత విస్పష్టంగా కలుగుతుంది. ఈ దివ్యానుభవ మననం చేత నీవు ప్రశాంతి పరుడవు కాగలవు.'

9. 'నా సర్వస్వం, నా తండ్రి, నా తల్లి, నాకు సమస్తమూ అయిన నా ప్రభువును నేను నా కళ్లతో ఎప్పుడు చూస్తాను ? నేను నా యీ చేతులతో పరమ మృదువులై అతి సుందరాలైన వికసిత పద్మాలవంటి స్వామి పాదాలను ఎప్పుడు స్పృశిస్తాను ? నేను సర్మాత్మనా ఆ పాద పద్మాలలో ఎప్పుడు లీనమవుతాను ? ఆ అమృత సముద్రంలో నేను కరిగిపోయే దెప్పుడు ?'

10. 'విముక్త దశలో జీవాత్మయందు ప్రస్ఫుటమయ్యే దోష దూరత్వాది మహోన్నత లక్షణాలు దాని సహజ స్వభావానికి చెందినవే అనడంలో ఎట్టి సందేహమూ లేదు. కాని అది అట్టి స్వభావం కలది కావడం ఆ పురుషోత్తముని మీద ఆధారపడి ఉన్నది. అవి తాము ఆధారపడిన ప్రభువు శాశ్వతంగా ఉన్నంతవరకే శాశ్వతమై ఉంటాయి. దీన్ని బట్టి విముక్త జీవులకు లభిస్తుందనే ప్రభువుతోడి సమానత్వం విశ్వపాలనాది శక్తులకు విస్తృత మవుతుం దనడానికి వీలులేదు అనిపిస్తుంది.'

11. 'అహంకార వినాశనంతో మానవుడు విముక్తు డవుతాడనే మాట నిశ్చయమయితే విముక్తి సూచన లభించగానే మానవుడు దానికి దూరమవుతాడు. తానే లేకపోయి నప్పుడు తన కా ముక్తితో ప్రయోజన మేమిటని అత డడుగ గలడు. తాను వినష్టమైన తర్వాత శుద్ధ చిత్స్వరూప మేదో మిగులుతుందన్న భావంతో వివేకవంతు డెవ్వడూ కృషి చెయ్యడు.'

12. 'తీవ్ర ధ్యాన లక్షణం కలదే ఉపాసన. అందులో బ్రహ్మ స్ఫురణ ప్రత్యక్షంగా ఉంటుంది.'
13. 'ఉత్తమజ్ఞానాన్ని మానవుడు పొందినప్పుడు అతడు నిస్సంగుడు కావడమూ, అతని పాపములన్నీ నశించడం మొదలైనవి జ్ఞానశక్తి మూలకాలే కావచ్చును.'
14. 'దేవతలు, మానవులు, జంతువులు, అచేతనములు - ఎవరైనా సరే ఉచ్చ నీచ భేదంతో గాని జాతి వర్ణ వివక్షతో గాని రూప స్వభావాది విభేదాలతోగాని నిమిత్తం లేకుండా అట్టి భేదాల కన్నింటికీ అతీతంగా సర్వ సమాశ్రయణీయుణ్ణిగా నే నందరికీ సమానుడనే. జాతి వర్ణరూప స్వభావాదులచేత ఒకరు తక్కువైనంత మాత్రంచేత వారు నన్నాశ్రయించ రాదని గాని వారు నాకు తక్కువ ప్రేమ పాత్రులవుతారని గాని అనుకోరాదు. అలాగే ఆయా జాతి వర్ణాదులలో ఒక రెక్కువై అందువల్ల నన్నాశ్రయించే అర్హత వారి కెక్కువ ఉన్నదని గాని వారు నా కెక్కువ ఇష్టులవుతారని గాని భావించరాదు.'
15. 'శ్రుతి సూక్తులలో పరంజ్యోతిగా ప్రకాశిస్తూ, భక్తి తాత్పర్యాలతో తన్నాశ్రయించే సర్వులనూ రక్షించే నిశ్చయంతో ఉంటూ, ఈ సర్వ విశ్వ సృష్టి స్థితి సంహారాలను లీలగా హేలగా నిర్వర్తిస్తూ, పురుషోత్తముడై పరబ్రహ్మమైన శ్రీనివాసుని యందు గాఢ ప్రేమగా పరిణమించే విజ్ఞానం నాదగు గాక!'
16. 'ప్రత్యక్ష జ్ఞానం వల్ల కేవలమైన ఉనికిమే విదితమవుతోందన్నట్లయితే వేరు వేరు వస్తువులను గూర్చి విస్పష్టమవుతున్న నిశ్చయం - ఇక్కడ ఘటమున్నది, అక్కడ పట మున్నది - అనే భేదజ్ఞానం అర్థ రహితమే అవుతుంది. జాతి స్వభావాదుల చేత రూప వైవిధ్యాన్ని పొందుతున్న

పదార్థాల భేదం జ్ఞాన లక్ష్యం కాదంటే దొరకిన దున్నతో తృప్తిపడక మానవుడు గుర్రానికై గాలించడ మెందుకు?'

17. 'భేద పరిజ్ఞానమే ప్రత్యక్ష జ్ఞాన లక్ష్యమైనప్పుడు అనుమాన లక్ష్యమూ అంతే అవుతుంది. ప్రత్యక్షాది జ్ఞాన సాధనాల చేత లభించిన జ్ఞానాన్ని ఆధారం చేసుకునే అనుమానం ప్రవర్తిస్తోంది. అందుచేత ప్రమాణాలు ఎన్నున్న విష యంలో ఎంత భిన్నాభిప్రాయం ఉన్నా అందరూ అంగీ కరించే ప్రమాణాల కన్నింటికీ భేదాన్ని గుర్తించడమే లక్ష్యమవుతున్నందువల్ల ఏ ప్రమాణం చేతా భేద రహిత వస్తుజ్ఞానాన్ని సాధించలేము.'

18. 'ఇంద్రియ జ్ఞానా తీత మైన బ్రహ్మము ప్రత్యక్షాది ప్రమాణ ప్రమేయ మెన్నటికీ కాదు. ఒక్క శబ్ద ప్రమాణం చేతనే తెలిసికోదగినది.'

19. 'శ్రుత్యను గుణమైన తర్కంతో బ్రహ్మాస్తిత్వము స్థిరీక రించుకోవలెనను దృష్టితోనే శ్రుతిలో కొన్ని భాగాలు ఆత్మ శ్రోతవ్యమనీ మంతవ్యమనీ ఇత్యాదిగా ప్రకటిస్తున్నాయి.'

20. 'చైతన్యం లేదా జ్ఞానము యొక్క ముఖ్యతత్త్వ మేమిటంటే అది తనకు తానే ప్రకాశిస్తుంది. లేదా తన్ను తానే తన ఉనికి ద్వారానే తన వస్తుత్వాన్ని రుజువు చెయ్యడంలో తానే సాధనమవుతోంది.'

21. 'చైతన్యం లేదా జ్ఞానము యొక్క ముఖ్య స్వభావమేమిటంటే అది తన స్థితి చేతనే తన సారమైన వాగ్వ్యవములకు గమ్య ములయ్యే వస్తువులుగా పదార్థాలను సమర్థం చేస్తోంది. జ్ఞాన మనబడే ఈ అనుభూతి చిదాత్మ యొక్క ఒకా నొక విశేషమై వస్తువులకు సంబంధించిన దవుతోంది. అందుచేత నాకు ఘటము తెలియును, నాకా విషయ మర్థమైనది, ఈ వస్త్ర ఖండ పరిజ్ఞానము నేను పొందాను ఇత్యాది

వ్యవహారాల ద్వారా సర్వ జీవులూ స్వాత్మ సాక్ష్యం పొందుతున్నారని అందరికీ విదితమవుతోంది.'

22. 'సర్వ సాధారణమైన నేత్రాలుగల మానవులలో దుర్గమమైన మారుమూల పర్వత గుహలలో నివసిస్తూ ఒకానొక వస్తుస్థితి బొత్తిగా తెలియని ఒక ప్రత్యేక నేత్ర దోష పీడితమైన మానవజాతి ఒకటి ఉన్నదని ఊహిద్దాము. అట్టి జాతివారి కందరికీ ఒకే విధమయిన దృష్టి దోషమున్నందు వల్ల వారందరూ ఒక వస్తువును వారికి తోచినట్లు ఒకే విధంగా చూస్తారు. ఉదాహరణకు వారు, ఉన్నది ఒక్క చంద్రుడే అయినా, చంద్ర ద్వయమున్నట్లుగా చూస్తారు. అట్టి జాతివారి విషయంలో వారికి కలిగే ప్రథమ జ్ఞానానికి భిన్నంగా యదార్థ జ్ఞానం కలిగే అవకాశం లేనప్పటికీ చంద్రులిద్దరున్నారనేది అసత్యమే అవుతుంది. వారి దృష్టి దోషమే వారికి కలిగే సత్య విరుద్ధమైన దర్శనానికి హేతువవుతోంది.'

23. 'మిక్కిలి గొప్పది అను అర్థము గల బ్రహ్మ శబ్దము స్వభావము చేతా, గుణముల చేతా, సర్వ శ్రేష్ఠమయిన దాన్ని తెలుపుతున్నందువల్ల అనంత పరిపూర్ణమైన ఆ బ్రహ్మమే సమస్తానికీ ప్రభువవుతున్నాడు.'

24. 'సర్వ పదాలూ పదార్థాలూ పరమ పురుష పదానికి లోబడినవే అవుతున్నందువల్ల, ఉన్నదా పరమ పురుషుడొక్కడే. తక్కినవన్నీ అతని విశేషణాలే. అతనితో తక్కిన వానికి సామానాధికరణ్యమే ఉంటుంది. విశేషణ విశేష్యాలకున్న అవినాభావ సంబంధాన్నే సామానాధికరణ్యమంటారు.'

25. 'చేతనా చేతన వ్యక్తులన్నీ ఆ పరబ్రహ్మ స్వరూపాలే.

అందుచేతనే వాని కస్తిత్వ మేర్పడి సత్యత్వాన్ని కలిగి ఉంటున్నాయి.'

26. 'కుడి కంటి యందుండే అక్షి పురుషుడూ ఆదిత్య మండలాంతర్వర్తియైన పురుషుడూ ఒక్కరే. ఇతని సంధ్యంగాలే అతనికీ సంధ్యంగాలు. ఇతని నామమే అతనికీ నామమవుతోంది.'

27. 'వ్యష్టి జీవుని కార్య కలాపం పరమాత్మ మీదనే ఆధారపడి ఉన్నదా లేక అతడు స్వతంత్రుడా? అతనికి స్వాతంత్ర్య మున్నది. లేదన్నట్లయితే విధి నిషేధరూపమయిన పవిత్ర వాఙ్మయమైన శ్రుతి స్మృతులన్నీ నిరర్థకాలే అవుతాయి. ఎందుచేతనంటే విధిగాని నిషేధంగాని అనుసరించడానికీ మానడానికీ స్వాతంత్ర్యం ఉన్న వాళ్లకే చెప్పాలి.'

28. 'విశ్వమూ బ్రహ్మమూ శరీరమూ శరీర - అవయవాలూ అవయవీ - ఏక దేశమూ - సంపూర్ణమూ - ఇట్టి సంబంధంతోనే ఉన్నాయి. బ్రహ్మము దీపమైతే దానిచేత వెలిగింపబడుతున్నది విశ్వము. బ్రహ్మమాత్మ అయితే విశ్వము దాని శక్తి. ఈ విషయాన్నీ పరాశరుడూ తక్కిన స్మృతికర్తలూ స్పష్టంగా ప్రకటిస్తున్నారు. "అగ్ని ఉన్న దొక్క చోటనే అయినా దాని ఔష్ణ్యమూ తేజస్సూ చుట్టు ప్రక్కలంతా ప్రసరించేటట్లు ఆ పరబ్రహ్మము యొక్క శక్తియే విశ్వంగా రూపొందుతోంది." '.

29. 'ఈశ్వరుడు నా ఆత్మ. నా సర్వస్వమూ అతనిమీదనే ఆధారపడి ఉన్నది. అది ఎలాగని అడిగేటట్లయితే దానికి జవాబు ఆ ఈశ్వరుడు కూడా నేను లేనిదే ఉండడు. అతని పరమోన్నత లక్ష్యమే యిది. అతడు లేనిదే నేనుండలేను.'

30. 'ఈ విశ్వానికి నిమిత్త కారణమూ, ఉపాదాన కారణమూ బ్రహ్మమే అని శ్రుతి చెపుతోంది. ఈ స్వర్గమర్త్యాల నిర్మాణానికి ఉపయుక్తమైన కొయ్య ఏది, వృక్షమేది? బ్రహ్మమే ఆ కొయ్య, బ్రహ్మమే ఆ వృక్షము. లౌకిక దృష్టిలో ఈ విశ్వ నిర్మాణానికి ఏ పదార్థాన్ని వినియోగించారు, ఏ పనిముట్లు వాడారు అని ప్రశ్నించినప్పుడు దానికి సమాధానంగా బ్రహ్మమే పదార్థమనీ బ్రహ్మమే ఉపకరణమనీ స్పష్టంగా శ్రుతి చెపుతున్నది.'

31. 'ప్రకృతి అచేతన తత్త్వం గల ద్రవ్యం. భౌతిక జగన్నిర్మాణానికి ఉపాదాన కారణము. సుఖ దుఃఖానుభవ సాధనము. అనాదిగా తనతో సంబంధమున్న చేతనులైన జీవుల విముక్తికే అదే తోడ్పడుతోంది.

32. 'ఆత్మ, వాగాది కరణములెప్పుడూ సన్నద్ధంగానే ఉన్నా, తాను కోరినప్పుడే వాని నుపయోగించి వ్యవహరిస్తుంది. ఉలి, రంపము, గొడ్డలి మున్నగు ఉపకరణాలను వడ్రంగి కావాలన్నప్పుడే ఉపయోగించుకుంటూ వద్దనుకున్నప్పుడు ఊరికే ఉన్నట్లు.'

33. 'భగవత్సాంగత్యమే భక్తుని ఏకైక సుఖం. భగవంతునికి దూరమయితే అతని వేదన దుస్సహమవుతుంది. నిజమైన భక్తుడు తన కష్టాలకు తన దోషాలే కారణమనుకుంటాడు. అంతేకాక చరాచర జగత్తంతా ఆ భగవంతుని పరిపాలనలో ఉన్నదని అతని దృఢమైన విశ్వాసం.'

34. 'చేతనా చేతన విశ్వ సర్వస్వమూ తన శరీరమై, చరాచర జగత్తుకంతకూ ఆత్మయై, అనపాయినియైన జ్ఞాన శ్రీదేవితో కూడి, ఏ దోషమూ లేని పరమానంద సముద్రుడైన ఆ శ్రీ మహావిష్ణువునకు నేను వినమ్రుడనై నమస్కరిస్తున్నాను.'

35. 'అథాఽతో బ్రహ్మ జిజ్ఞాసా—అనంతరము అందుచేత

బ్రహ్మమును గూర్చిన జిజ్ఞాస (విచారణ) కర్తవ్యమగు చున్నది. ఇక్కడ అథ శబ్దము—వెంటనే అందుచేత అనే అర్థమిచ్చే అతశ్శబ్దమున్నందువల్ల— ఆ తరువాత అన్న కాలవాచికావ్యయార్థంలో ఉపయుక్తమయింది. అందు చేత అని అర్థమిచ్చే అతశ్శబ్ద ప్రయోగం చేత వెనుక పూర్తి అయిన దేదో దీనికి హేతువన్న భావం కలుగు తోంది. వెనుక పూర్తి అయినది వేదంలో పూర్వ భాగమైన కర్మకాండను గూర్చిన విచారణ అని బోధ పడుతోంది. ఎందుచేతనంటే ఇప్పుడు ప్రారంభిస్తున్న బ్రహ్మ విచారణ వేదంలో ఉత్తర భాగానికి చెందినది. నిజానికి వేదాధ్య యనం చేసిన వాని ప్రథమ కర్తవ్యం, వేదాలు ప్రారం భంలో కర్మ కాండను గూర్చి చెపుతున్నాయి కాబట్టి, ఆ కర్మ కాండను గూర్చి విచారణ చెయ్యడం. అందుచేతనే అప్పుడు అథాతో ధర్మ జిజ్ఞాసా అని చెప్పబడింది. ఈ ధర్మాన్ని గూర్చి ప్రత్యేకంగా విచారిస్తూ ధర్మ సూత్రాలు ఇలా నిర్ధారణ చేస్తున్నాయి. పురోహిత కార్య జాతం అందరూ చెయ్యగలిగినవే కాబట్టి అన్ని వర్ణాల వారికీ సమానమే కావాలి. (మీమాంస 12-4-40) ప్రకృతి వికృతి విభాగాలకు చెందిన వివిధ కర్మలు పురుషార్థములైన ధర్మార్థ కామములనే త్రివర్గమునకు సాధనములు మాత్రమే.'

36. 'సర్వ సృష్టి హేతువై, సర్వాంతర్యామియై, ఆనంద పూర్ణు డైన ఆనందమయుడు, అతనికి శరీరం ఉన్నదని చెప్పి నంత మాత్రాన, అతడు అసాధారణ శక్తి సామర్థ్యాలు కల జీవుడే కాని పరమాత్మ కాడని భ్రమించగూడదు. అతడు పరమాత్మయైన పురుషోత్తముడే! పురుష శబ్దము శ్రుతిలో అనేక సందర్భాల్లో ఇట్టి తాత్పర్యంతోనే ప్రయుక్త

మవుతోంది. 'ఆదిత్య మండలాంతర్వర్తి యయిన పురుషుడు హిరణ్య వర్ణుడై ప్రకాశిస్తున్నాడు' (ఛాందోగ్య-1-6-6) ఎందుచేత ? ఈ సందర్భంలో ఆ పరమాత్మ విశేషణాలు చెపుతున్నందువల్ల పురుషశబ్దం ప్రయుక్త మయింది. వ్యష్టి జీవుని కంటె భిన్నుడయిన పురుషోత్తముడు విశ్వాని కంతటికీ అధిపతియై సర్వ కామములకు అధీశ్వరుడు కావడమే అతని విశేషం. అతడు కర్మబద్ధుడైన జీవుడు కాడు. శ్రుతి ఈ విషయాన్ని విస్పష్టం చేస్తోంది. 'అతడనేక బ్రహ్మాండ ములకూ, సర్వ కామములకూ ఈశ్వరుడు. అతని నామము సర్వోత్కృష్టము.' ఈ పురుషుడే సర్వ దోషములకూ అతీతుడవుతున్నాడు.

37. 'భౌతికాధ్యాత్మిక పదార్థాలన్నీ అంగ భూతమే అవుతున్న అంగియైన మహా విష్ణువునకు ప్రణామములు. ఆ విష్ణువు శేషునిపై విశ్రమిస్తాడు. ఆయన అనంత కల్యాణ గుణ ములకు నిధి.'

38. 'యామున మహర్షి విజయమందు గాక! అనుభవానికీ తర్కానికీ విరుద్ధమే అయినప్పటికీ ప్రపంచాన్నంతటినీ ఆవరించిన అజ్ఞానాంధకారాన్ని ఆ మహానుభావుడు తొల గించాడు. సర్వోత్కృష్టమయిన పరబ్రహ్మము నిర్గుణ మనీ, అవిద్యా ప్రభావం చేత సంసార నిబద్ధమై ఉన్న దనీ అనుకోవడం కంటె అజ్ఞాన మేముంటుంది? ఆ బ్రహ్మము తనకు భిన్నమైన లక్షణాల చేత సంకుచితమై అందుచేతనే కర్మ బద్ధమవుతోందట! ఆ బ్రహ్మమే అవిద్యకూ, అపరిపూర్ణతకూ ఆకరమట! ఇవన్నీ అజ్ఞాన విలసితాలయిన భావాలే.'

## శ్రీ రామానుజుల గ్రంథములు

1. వేదార్థ సంగ్రహము
2. శ్రీ భాష్యము
3. గీతా భాష్యము
4. వేదాంత దీపము
5. వేదాంత సారము
6. శరణాగతి గద్య
7. శ్రీరంగ గద్య
8. శ్రీ వైకుంఠ గద్య
9. నిత్య గ్రంథము

# ఉపయుక్త గ్రంథ పట్టిక


1. శ్రీ రామానుజ జీవితము - స్వామి రామకృష్ణానంద. (శ్రీరామకృష్ణ మఠము - మదరాసు)
2. విశిష్టాద్వైత వేదాంతము - పి. ఎన్. శ్రీనివాసాచార్య, మదరాసు.
3. స్వీయ వచనాలలో రామానుజుల బోధలు - ఎమ్. యామునాచార్య. (భారతీయ విద్యాభవనము, బొంబాయి)
4. దక్షిణ భారతదేశ ఆళ్వారులు - కె. సి. వరదాచారి. (భారతీయ విద్యా భవనము, బొంబాయి).
5. ఆళ్వారుల స్తోత్రములు - జె. ఎమ్. ఎస్. హూపరు.
6. గురు పరంపరా ప్రభావము - ఓరియంటల్ మాన్యు స్క్రిప్టు లైబ్రరీ, మదరాసు.
7. రామానుజ నూరంతాతి-తిరువరంగతు అముదనార్ (ముర్రే అండ్ కో)
8. గురుపరంపరై వరలారు-అలగియ నంబి.
9. దివ్య ప్రబంధము-ముర్రే అండ్ కో-4 వాల్యూములు. పి. శ్రీ.
10. శ్రీ రామానుజర్ - స్వదేశమిత్రన్, మదరాసు.